# సీతా కల్యాణము

( యక్షగాన నాటకము )

శ్రీ శాహ మహారాజ ప్రణీతము


సంపాదకులు

డాక్టర్ దివాకర్ల వేంకటావధాని, M. A., Ph.D.,

ప్రొఫెసర్ - తెలుఁగు శాఖ

ఉస్మానియా విశ్వవిద్యాలయము

శ్రీ కె. వేంకటేశ్వరరావు

హైదరాబాదు





తొలిపలుకు

వాఙ్మయ మహాధ్యక్ష

డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య

"కళా-ప్రపూర్ణ"


ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు

లైబ్రరీ అండ్ రీసర్చి ఇన్‌స్టిట్యూట్

( State Archives )

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

హైదరాబాదు

# తొలి పలుకు

ఇది "సీతాకల్యాణం" అన్న పేరుగల యక్షగాన నాటకం. "శ్రీశాహ మహారాజ ప్రణీతంబైన సీతాకల్యాణం బనెడు నాటకంబు" అని దీని రచయితయే తొలుత నాటక శబ్ద ప్రయోగంతో సూత్రధారునిచేత పలికించాడు. అంతకు ముందు ప్రార్థన, ప్రస్తావన శ్లోకాలలోవున్న 'శాహేంద్రస్య కలానవద్య' ఇత్యాది శ్లోకంలో 'సోఽహం చేదృశ రూపకాభినయనే పారంగతో రంగతః' అని అభినయ పూర్వకమైన రూపకంగానే మరింత సుస్పష్టంగా పేర్కొన్నాడు. కాబట్టి యిది స్టేజీ నాటకం వంటి యక్షగాన నాటకమన్న విషయం స్పష్టం. మనవారు గుర్తించ లేదుకాని, గత అర్ధ శతాబ్దిగా ఆధునిక రచనలుగా చలామణీ అవుతున్న పద్య, గేయ, నాటికల, సంగీత రూపకాల, అవతరణకు తొలుత మార్గదర్శకాలు యీ యక్షగాన రూపకాలే !

క్రీస్తుశకం 1000 ప్రాంతం నుంచే తెలుగులో ప్రసిద్ధమై 17, 18 శతాబ్దాలలో బహురూపాలుగా విస్తృతి గాంచిన యీ యక్షగాన రచనల ప్రసక్తి అదే శబ్దంతోనే తెలుగులో మొదట తెచ్చినవాడు—లభ్యమైనంతలో శ్రీనాథుడు—భీమేశ్వర పురాణంలో

కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు
గాంధర్వమున యక్షగాన సరణి

( 3 ఆశ్వా. )

అని దాక్షారామ ప్రశంసలో పేర్కొన్నాడు. అయితే, ప్రత్యక్షంగా యక్షగాన ప్రసక్తి శ్రీనాథుడిందులో చెయ్యలేదు. ప్రత్యక్షంగా వున్నా యీ ప్రసక్తి అప్రత్యక్షమే. ఈ సందర్భంలో గాంధర్వులు గాంధర్వంలో కీర్తించడాన్నే శ్రీనాథు డుద్దేశించాడుగాని యక్షగానాన్ని కాదు. యక్షగాన పద్ధతిలో కీర్తిస్తారని ఉపమానంగా చెప్పడానికి యక్షగాన ప్రసక్తి తెచ్చాడు. అప్రసిద్ధమైన అంశాన్ని చెప్ప వలచినపుడు ప్రసిద్ధాంశాన్ని ఉపమగా స్వీకరించి చెప్పడం సామాన్యమైన విషయమే కదా ! అప్పటికి బాగా ప్రసిద్ధిగా అందరికీ తెలిసివున్న యక్షగానాన్ని పేర్కొని ఆ పద్ధతిలోనే గంధర్వులు గాంధర్వ గానంలో కీర్తిస్తారని స్పష్టపరచాడు. అంటే క్రి. శ. 1400 ప్రాంతంలో యక్షగానం పూర్తిగా సుప్రసిద్ధమై ఉన్నదన్నమాట. కాగా, క్రి. శ. 16వ శతాబ్ది తొలుతటివాడైన చిత్రకవి పెద్దన

వృషభగతి త్రిపుట రేకంఘ్రి యుగమగు
దునఁ నేడు లఘువులు తొలగజేయ
జంపె రేకునకు లక్షణము ద్విరదగతి
యగు గాన నొక లఘువందు మాన

రచ్చరేకగును ఎంగ పల్గనముగతి
    మరి యేక తాళియా మధురగతిని

అటతాళమున మాత్రలంఘ్రికిర్వదినాల్గు
    నాల్గిట విరతి పధ్నాలుగింట

నిలుచు నర్ధంపు నర్ధచంద్రికలు దీన
యక్షగానాదికృతులలో నార్యులిడిన
రగడ భేదంబులివియౌను రమ్యచర్య
యవిద నిజదాస సముదాయ యాంజనేయ!

(లా. సా. సం. 2-ఆ)

అంటూ యక్షగాన రచనల అత్యంత ప్రాచీనతను దృష్టిలో పెట్టుకుని "ఆర్యులిడిన రగడ భేదాలు" అనడంలో ఆశ్చర్యకరమైన దేదీలేదు. యక్షగానం ఆర్యుల రచన అవునా? కాదా? అన్నది తరువాతి మాట గాని అది ఆర్యుల రచనగా పెద్దన భావించాడని మనం అనుకోకూడదు. పెద్దలు-పూర్వులు-ప్రాచీనులు-యక్షగానాల్లో యీరగడ భేదాలుంచారు అన్న అభిప్రాయాన్ని అభివ్యక్తీకరించడం కోసమే "ఆర్యులిడిన' అన్న ప్రయోగాన్ని పెద్దన చేశాడు గాని, యక్షగానం ద్రావిడుల రచనయా! ఆర్యుల రచనయా? అన్న జాతిభేదాన్ని దృష్టిలో పెట్టుకుని ఆ పదాన్ని ప్రయోగించలేదు. దీనివల్ల యక్షగానం చాలా ప్రాచీన మైనదనే అభిప్రాయాన్ని పెద్దన వెల్లడించాడన్నమాట. శ్రీనాథుని కాలానికే చాలా ప్రసిద్ధ మైనదిగా భావింపబడే యక్షగానం శతాబ్దం తరువాత పాచీనమైనదిగా భావింపబడడంలో విడ్డూరమేమీలేదుకదా!

## పాల్కురికి కాలానికే పాతబడిన యక్షగానాలు

ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే, అసలు యక్షగానం పాల్కురికి సోమనాథుని కాలానికే (క్రీ. శ. 1280) చాలా ప్రసిద్ధమై పాతబడిపోయిందా! అని కూడా అనిపించడం. శ్రీశైలంలో శివరాత్రి జాగరణ సందర్భంలో జరిగే వినోద కాలక్షేపాలను వర్ణిస్తూ సోమన 'పండితారాధ్య చరిత్ర' లో

ఆదట గంధర్వ యక్ష విద్యాధ
రాదులై పాడెడు నాడెడు వారు
విధమున బ్రచ్ఛన్న వేషముల్ దాల్చి
యధికోత్సవము దులుకాడునట్లు.

(436 పుట)

అని పేర్కొన్నాడు. ఇందులో ఒక తిరుగుడు వున్నది. ఈ తిరుగుడు గుర్తించక గంధర్వ యక్ష విద్యాధరాదుల వేషాలు వేసుకుని పాటలు పాడుతూ, ఆట (నృత్య నాటకాదులు) లాడేవారని సోమన పేర్కొన్నట్లు పండిత విమర్శకులు భావించారు. ఇది సరికాదు. సోమనకు పూర్వకాలంలో గంధర్వ యక్ష విద్యాధరాదులై-అంటే

గంధర్వాదుల వేషాలు దాల్చి కొందరు పాడేవారు, ఆడేవారు. గంధర్వాదుల వేషాలుదాల్చి పాడే, ఆడే వారివలె ప్రచ్ఛన్నవేషాలు వేసుకొని కొందరు పాడి ఆడేవారు, అని సోమన అంటున్నాడు. ఈ ద్విపదలో గంధర్వులు, యక్షులు, విద్యాధరాదులు ఆడతారు, పాడతారు అన్న విషయం సోమన సూటిగా చెప్పడంలేదు. గర్భితంగా చెపుతున్నాడు. గంధర్వయక్ష విద్యాధరాదులై-అంటే వారే అయి - లేదా వారి వేషాలు దాల్చినవారై - అని అర్థాలు చెప్పాలి. వారే అవడం అంత సులభంకాదు. వారి వేషాలు ధరించడం అసాధ్యంకాదు. కాబట్టి యిక్కడ వారి వేషాలు వేసుకుని-అని అర్థం చెప్పుకుంటేనే సముచితంగా వుంటుంది. వారి వేషాలు ధరించి పాడే, ఆడేవారి విధంగా (వలె) ప్రచ్ఛన్నవేషాలు వేసుకుని శివ భక్తులు పాడారు, ఆడారు అన్నది సోమన భావం. ఇంకా సూటిగా చెప్పాలంటే శివరాత్రినాడు పాడి, ఆడినవారు గంధర్వాది వేషాలు వేసుకున్నవారు కారు. గంధర్వాదుల వేషాలు వేసుకుని పాడే, ఆడే వారివలె, వేషాలు వేసుకున్నవారు. అయితే వీరు గంధర్వాదుల వేషాలు వేసుకోలేదన్నమాట! ఆ వేషాలే వేసుకుంటే గంధర్వాదుల వేషాలు వేసుకున్నారనే చెప్పేవాడు కదా! బహుశా శివసంబంధమైన గాథలకు సంబంధించిన సముచితమైన వేషాలు వేసుకుని వుంటారు. ఆగాథలకు సంబంధించిన పాటలు పాడుతూ, ఆడివుంటారు. శివరాత్రివేళ కొందరు భక్తులు వేషాలు వేసుకొని పాడడం, ఆడడం ఎలా ఉన్నదంటే కొందరు గంధర్వాదుల వేషాలు వేసుకొని పాడడం, ఆడడం వలె వున్నది. అసలు సోమనకు పూర్వం గంధర్వాదుల వేషాలు వేసుకుని కొందరు పాడి, ఆడేవారన్నమాట తేట తెల్లమవడంలేదా! కొందరు మానవులు గంధర్వాదుల వేషాలు వేసుకుని పాడి ఆడేవారంటే గంధర్వ, యక్ష, విద్యాధరాదులుకూడా గానలోలురు, నాట్యలోలురు అన్నమాట స్పష్టమవడం లేదా? వారు గాన, నాట్యలోలురు కాబట్టి వారిననుకరించి వారి వేషాలు సయితం దాల్చి గాన, నాట్యలోలురై కొందరు పూర్వం తామానందించి, ప్రజలనానందపరచేవారన్నమాట. కాగా, పాల్కురికి సోమన కాలానికి బాగా పూర్వమే గంధర్వాదుల వేషాలు వేసుకుని పాడడం, ఆడడం దేశంలో సుప్రసిద్ధమై వున్నదని స్పష్టమవడం లేదా? ప్రస్తుత సీతాకల్యాణ నాటకం పద్ధతిలో కాకపోయినా మరో రూపంలో అయినా యక్షగాన మన్నది 10వ శతాబ్దినాటికే ఒక రూపం తాల్చి వున్నదన్నమాట.

అసలు 'యక్షగానం' అన్న పేరు సంస్కృత పదాలతో రూపొందింది. ఏదో ఒక దేశి తెలుగుపేరుకు సంస్కృతీకరణంగానైనా యిది రూపొందినట్లు ఎవరూ భావించలేదు. యక్షగానం మొదటి రూపలక్షణం దేశిపరమైందా? మార్గపరమైందా? అని ఆలోచించడానికిముందు అసలు యక్షగానం అంటే ఏమిటో ఆ శబ్ద స్వరూప స్వభావాలేమిటో గుర్తించాలి కదా! యక్షగానం కేవలం దేశి రచనే గాని మార్గ రచన కాదని విమర్శకులంతా అభిప్రాయపడ్డారు. అయితే క్రమంగా యక్షగానంలో మార్గరూపక రచనాపద్ధతి ప్రవేశించిందని వీరంతా అభిప్రాయపడ్డారు.

రచనల గురించి తెలుసుకోవాలంటే కవిత పుట్టుకనుగూర్చి తెలుసుకోవాలి. కవిత పుట్టుకను గూర్చి తెలుసుకోవాలంటే భాషోత్పత్తిని గురించి, భాషోత్పత్తి

గురించి తెలుసుకోవాలంటే ముందు మానవోత్పత్తి గురించి, దాన్ని గురించి తెలుసుకోవాలంటే సృష్టి వ్యవస్థ గురించి, దాని మూల స్వరూప స్వభావాల పరిణామాల గురించి తెలుసుకోవాలి. ఆర్షదృక్కుతో సరైన పరిశోధన, పరిశీలనలు జరిపి యిన్ని విషయాలూ, సత్య సమ్మతంగా నిరూపించడం యిప్పుడంత సాధ్యంకాదు కాబట్టి అంత మూలమట్టం వరకూ వెళ్లకుండానే మిగిలిన వాస్తవిక విషయాలను గుర్తించడానికి ప్రయత్నించుదాం.

యక్షగానమంటే 'యక్షుల గానం' (యక్షులు చేసే గానం), యక్షుల కోసం చేసే గానం, అని రెండర్థాలు. యక్షులగానం వలే చేసేగానం అని కూడా మూడో అర్థాన్ని చెప్పుకోవచ్చు. అయితే యక్షులంటే ఎవరు ? వేదవాఙ్మయంలో పలు తావుల్లో యక్ష యక్షి శబ్దాలు ప్రయోగింపబడ్డాయి.

యేన కర్మాణ్యపసో మనీషిణో
యజ్ఞే కృణ్వంతి విదథేషు ధీరాః
యదపూర్వం యక్షమంతః ప్రజానాం
తన్మే మనః శివ సంకల్ప మస్తు ॥

అగ్నే రనేక మప ఆవివేశాపా
న్నపాన్న పాత్రప్తి రక్షన్న సుర్యం
దమే దమే సమిధం యక్ష్యగ్నే
ప్రతితే జిహ్వోఘృత మచ్చరణ్యాత్ స్వాహా ॥

ఇత్యాదిగాగల అనేక వేదమంత్రాలలో యక్షాది శబ్దాలు ప్రయుక్తాలయ్యాయి. ఆర్షేయ దృక్పథంతోనూ, దివ్యచక్షువుతోనూకాక, కేవల లౌకికమైన బుద్ధితో ఎవరో వూహించిన అర్థాలను దృష్టిలో పెట్టుకుని వేద విజ్ఞానాన్ని సరిచూచాలంటే కుంచేటికొమ్ముకై అన్వేషణ చెయ్యడమేకాగలదు. తెలిసినంతలో యక్షులు దేవయోని విశేషం. దేవతలలో ఒక తెగ. గృహ్యసూత్రాలలో భూతాదులతోపాటు యక్షావాహం పేర్కొనబడింది. ఇందులో విచిత్రం లేదు. అయదార్థం లేదు. ఆవాహమన్నది భూతాదులకు, యక్షులకు మాత్రమే పరిమితంకాదు. ఏ దేవయోని విశేష జాతులకైనా చెల్లుతుంది. బౌద్ధ సాహిత్యంలో యక్షులు నీతి ప్రసక్తకులుగా, రక్షకులుగా పేర్కొనబడ్డారంటే వారు దేవతలుకాబట్టే. దేవతలు చెయ్యలేనిది లేదుకదా ! మరి యక్షులు దేవయోని విశేషంకదా ! వారు కామరూపులు కూడా ! కామరూపులు అనడానికి అనేక కథలు గాథలు, ఆధారంగా వున్నాయి. కామరూపులైనప్పుడు, వారు తాల్చలేని రూపమంటూ వుండదు. యక్షులు భూత ప్రేత పిశాచాదిగణాల్లో చేరతారని కొందరు భావించడంలో అర్థంలేదు. ఎందులోనైనా చేరగలరు గదా! యక్షులకు గంధర్వకిన్నరాదులతో పూర్తిగా సంబంధాలున్నాయి. గంధర్వాదుల కున్నట్లుగా యక్షులకు గాన నృత్య ప్రావీణ్యం లేదని కొందరు భావించారు. అది సరికాదు. కుబేరుడు యక్షరాజేకాదు. కిన్నరేశుడు కూడా !

## యక్షులు - సంగీతం

విద్యాధరోఽప్సరో యక్షో రక్షో గంధర్వకిన్నరాః
పిశాచో గుహ్యక స్సిద్ధో భూతోఽమీ దేవయోనయః

అని వివిధ యోనులుగా పేర్కొనబడినా కుబేరుడు కిన్నరేశుడు.

కుబేరస్త్ర్యంబక సఖో యక్షరాడ్గుహ్యకేశ్వరః
మనుష్య ధర్మాధనదో రాజరాజో ధనాధిపః
కిన్నరేశో వైశ్రవణః పౌలస్త్యో నరవాహనః
యక్షైక పిఙ్గై లబిల శ్రీదపుణ్యజనేశ్వరాః ॥

అని గుహ్యకేశ్వరుడుగానూ, కిన్నరేశ్వరుడుగాకూడా పేర్కొనబడ్డాడు కదా !

యక్షులు అసలు రాక్షసులలో ఒక పాయ అని శ్రీ వి. ఆర్. ఆర్. దీక్షితార్ వ్రాయడంలో యదార్థమూ వుంది, అయదార్థమూ వుంది. దితి సంతానం దైతేయులు కాగా, అదితి సంతానం ఆదితేయులు కాలేదా ? రెండు జాతులకూ తండ్రి ఒక్కడేకదా ! దైతేయులూ, ఆదితేయులూ, పరస్పరం సవతి తల్లుల సంతానం అయినట్లే రావణ కుబేరాదులుకూడా పరస్పరం సవతి తల్లి కుమారులే ! ఆదితేయులు దైతేయులలో పాయ అనిగాని, దైతేయులలో ఆదితేయులు ఒక పాయ అనిగాని భావించడంలో ఔచిత్యం వున్నదనుకుంటే యక్షులను రాక్షసుల పాయగా భావించవచ్చు. యక్షులు కామరూపత్వంతో రాక్షసపిశాచాదులేవైనా కావచ్చు కాబట్టి వారిని ఆయా జాతుల కధిపతులుగా కూడా కొందరు భావించినట్లు కనిపిస్తున్నది.

అసలు యక్షగానం పుట్టింది భౌమజీవులైన యక్షుల వల్లనా ? దేవయోని విశేషులైన యక్షులవల్లనా ? అన్న విషయం పరిశోధించడానికిముందు, యక్షులకు నృత్యగానాలతో సంబంధం వున్నదో లేదో పరిశీలించుచాం. యక్షులు గానలోలులు అనడానికి

యక్షాశ్చ నాగాఽపి కిన్నరాశ్చ
గాంధర్వ ముఖ్యాఽపి గానలోలాః

అన్నమాటలే మనకు శరణ్యం కానక్కర్లేదు.

గీతేన ప్రీయతే దేవః సర్వజ్ఞః పార్వతీపతిః
గోపీపతి రనంతోఽపి వంశధ్వని వశంగతః
సామగీతి రతో బ్రహ్మా వీణాసక్తి సరస్వతీ
కిమన్యే యక్ష గంధర్వ దేవదానవ మానవాః

అంటూ శార్ఙ్గదేవుడు సంగీత రత్నాకరంలో పేర్కొనడం అపూర్వ విషయం కాదు. అమూలకమూ కాదు. అసలు యక్షులు కామరూపులు కదా ! అయినప్పుడు వారు

తాల్చలేని రూపం లేనట్లే వారికి వశం కాని విద్యలుండవు. కాగా, నృత్యగానాలలో యక్షులకు ప్రావీణ్యం వుండదని, ఆసక్తి వుండదని, భావించడం సత్యవిరుద్ధమే అవుతుంది.

కుబేరుడు విశ్రవో బ్రహ్మకుమారుడు. విశ్రవో బ్రహ్మ బ్రహ్మమానసపుత్రుడైన పులస్త్యుని కుమారుడు. కుబేరుడు తన తండ్రికి తండ్రియైన పులస్త్యుని విడిచి అసలు బ్రహ్మనుగురించి తపస్సుచేసి వరాలుపొందాడు. అప్పుడు పులస్త్యుడికి కోపంవచ్చి తన అర్ధశరీరంలోనుంచి విశ్రవసును సృష్టించి కుబేరుడికి అహితం చెయ్యవలసిందని ఆజ్ఞాపించాడు. ఇది తెలిసి కుబేరుడు నృత్యగీతాది విద్యలు నేర్చిన ముగ్గురు యువతులను తీసుకొనివెళ్లి విశ్రవసుడికి కానుకగా యిచ్చి 'నేను నీకు కొడుకు నౌతాను, నాకు అపకృతి చేయవద్దు,'' అని ప్రార్థించి పరిచర్యలు చేయగా విశ్రవసువు సంతోషపడి మిన్నకుంటాడు. ఇది ఉత్తర రామాయణ కథ. దీనినిబట్టి కుబేరునికి నృత్యగానాది విద్యలలో అత్యంత ఆసక్తి, అభిరుచి వుండడం మాత్రమే కాక, వాటి నభ్యసించిన యక్ష కన్యలను ఉపయోగించి తన కార్యం నెరవేర్చుకునే దృష్టి కూడా వున్నదని అర్థమవుతుంది. కుబేరుడు సమర్పించిన ముగ్గురు కన్యలూ, యక్ష కన్యలుకాక మరొక రెందుకవుతారు? యక్ష కన్యలకు నృత్యగానాలలో ప్రావీణ్యం వున్నదని, యీ కథవల్లనే అర్థమవుతుందికదా!

అసలు సంగీతం చరిత్రనుబట్టి చూస్తే యక్షగానం సంగీతంలో ఒక ముఖ్య భాగంగా కనిపిస్తున్నది. వైదిక సంగీతాన్ని పవిత్ర సంగీతం అంటారు శాస్త్రజ్ఞులు. ఈ పవిత్ర సంగీతం——"పవిత్ర సంగీతం—నాట్య సంగీతం—కాలక్షేప సంగీతం—నాటక సంగీతం—యక్షగాన సంగీతం"— మొదలైన విధాలుగా విభజించబడింది. అష్టపదులు, తరంగాలు, కీర్తనలు, దివ్యనామ సంకీర్తనలు, ఉత్సవ సంప్రదాయ సంకీర్తనలు, మొదలైనవన్నీ యీ తెగలకు సంబంధించినవే! ఆంజనేయ—అర్జున (పాండవ మధ్యముడుకాడు)—నారద—తుంబురు—రావణాదులు యీ పవిత్ర సంగీతావిర్భావ కర్తలైన పురాణ పురుషులు. కాగా ఆంజనేయ విరచితమని చెప్పబడే ఒకానొక ప్రాచీన సంగీత గ్రంథంలో యక్షుల గాన శైలీ ప్రశంస ఉన్నదంటే మనం ఆశ్చర్యపడవలసిన అవసరంలేదు.

అసలింతెందుకు? మార్గ సంగీతంలో ప్రత్యేకంగా "యక్ష ప్రియ" రాగం అన్న పేరుతో యక్షుల కత్యంత ప్రియమైన రాగమే ఒకటున్నది. యక్షానుగ్రహ సంపాదనలో యీ రాగం ఎంతైనా ఉపయోగపడగలదు. 37వ మేళకర్త అయిన "సాలగ" మేళకర్త జన్యరాగం యీ "యక్ష ప్రియరాగం". ఇందులో గాంధార దైవతాలు (గ–ధ లు) పరివర్జితాలౌతాయి–కాగా,

ఆరోహణం——స–రి–మ–ప–ని–స

అవరోహణం——స–ని–ప–మ–రి–స

అయి ద్విస్వరవర్జ్య రాగమౌతుంది. ఇంతటి స్వచ్ఛమైన "యక్ష ప్రియరాగం" యక్షానంద సంధాయకమై సశాస్త్రీయంగా శతసహస్రాబ్దాల తరబడిగా నిలచివుంటే యక్షుల గానలోలుపత్వం గురించి శంకించవలసిన పనేముంది? భట్టి, కాళిదాసా

దుల కావ్యాల్లో యక్షుల నృత్య సంగీత లోలుపత్వం గురించి స్పృశించడం అంత విశేషమేమీకాదు—ఈ యక్ష ప్రియరాగపరమైన రచనమూలమై క్రమంగా యక్ష గానంగా రూపొందిందేమో !

యక్షుల కామరూపత్వం కారణంగా వారేరూపమైనా తాల్చి గాననాట్యాలలో పరానుభూతులను స్వస్వానుభూతులుగా అనుభవించగలరు. ఈశ్వరుడు పార్వతితో క్రీడించి ఆనందానుభూతి పొందాడనుకోండి. తత్క్రీడాగతమైన ఆనందానుభూతిని కామరూపధారులుకాబట్టి ఆ యా రూపాలు దాల్చే, పార్వతీపరమేశ్వరులవలె క్రీడించి పొందేయోగ్యత యక్షులకు సహజంగానేవుంటుంది. అందువల్ల నృత్యగానాలలోనేకాదు, ఎందులోనైనా కామరూప ధారుల కున్నంత స్వపరానందానుభూతి పరవశత్వం మూలస్వరూపులకు తప్ప యితరులకే పరిస్థితుల్లోనూవుండదు. బహుశా, యీ యక్షుల కామరూపత్వం కారణంగానే బౌద్ధ శిల్పాలలో ద్వారపాలకత్వ రక్షకశక్తిత్వాలతో వీరికి స్థానంఏర్పడి వుండవచ్చు.

యక్షులకు ఒకేఒకక్కస్థానం మాత్రమే వుండేదని నిర్ణయించి గట్టిగా చెప్పడానికి శాస్త్రీయమైన ఆధారాలేమీలేవు. మంత్ర-తంత్ర-నిధి-శిల్ప-వృక్షాది శాస్త్రాలను పరిశీలిస్తే యక్షులకాశ్రయభూతం కానటువంటి పంచభూతాలు లేవని అర్థమవుతుంది. మన్ను-మిన్ను, గాలి-ధూళి, నిప్పు-నీరు, ఒక్కటేమిటి చెట్టు-చేమ, పుట్ట-పురుగు, ఆయి-అప్ప మొదలైనవన్నీ యక్షులకాశ్రయ భూతాలుగానే కనపడతాయి. యక్ష శబ్దంలో తొట్టతొలి వర్ణమైన 'య' వర్ణం వాయుబీజం. వాయువుగాని, వాయురూపంకొన్నదిగాని అది తాల్చలేనిరూపం ఉండదు. వాయువు కారణంగా చలించే మేఘాలే కామరూపాలుకాగా లేనిది వాయువు కామరూపం తాల్చడంలో విడ్డూరం లేదు. జన్మనః వాయుబీజ శక్తివంతులైన యక్షులు కామరూపులవడంలో కూడా విచిత్రంలేదు. గాయత్రీ సహస్రనామాలలో "యక్షిణి-యక్షరాజ ప్రసూతిని" ఉన్నాయంటే ఆ జగదంబవలే యక్షులు కూడా సర్వవ్యాపులన్నమాట—ఈ పద్ధతిలోచూస్తే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకూ వారి పత్నులకూ యక్షేశ్వరాది శబ్దాలు పర్యాయపదాలుగా నామంతరాలుగా చెల్లుతాయి.

దేవయోనులైన యక్షుల మాట అలావుంచి భోగులైన యక్షులు కొందరు భూలోకంలో రాజ్యాలు పరిపాలించారని, వారు దేవయోనులైన యక్షుల కంటె భిన్నులన్న భావాన్ని కొందరు విమర్శకులు వెల్లడించారు. అదేవిధంగా యక్షగానం అన్నది దివ్యులైన యక్షులతో సంబంధం కలగనడంకంటె మానవులైన యక్షులకు సంబంధించిందే అనడం చాలా సముచితంగా వుంటుందనికూడా భావించారు.

అసలు సృష్టి వ్యవస్థ గురించి ఆలోచిస్తే ఒక్క మానవులు, దేవతల గురించేకాదు—రకరకాలుగావున్న వారి సంబంధాలు గురించి కూడా యేం చెప్పాలన్నా—సత్యసమ్మతంగా చెప్పాలంటే మాత్రం భయం వేస్తుంది, జంకుపుడుతుంది, మనస్సు వెనకడుగు వేస్తుంది. తెలియనిదాన్ని గురించి—తెలిసీ తెలియనిదాన్ని గురించి చెప్పాలంటే—ఒక విశ్వాసంగా చెప్పాలంటే అది వేఱు మాట కాని తర్కసహంగా, సత్యసమ్మతంగా చెప్పాలంటే అంత తేలికకాదు.

బ్రహ్మ నాట్య ప్రవర్తనం చేశాడు. మహేశ్వరుడు నాట్య బోధ చేశాడు. అంటే నమ్ముతారు. వేదాలు బ్రహ్మచతుర్ముఖాలనుంచి వచ్చాయని అంటే ఒక దృష్టితో కాదనలేము.

నృత్తావసానే నటరాజరాజో
ననాద ఢక్కాం నవ పంచవారం
ఉద్ధర్తు కామా సనకాది సిద్ధా
నేత ద్విమర్శే శివ సూత్రజాలమ్

అన్న శ్లోకం అన్ని సందర్భాలలోనూ శిరోధార్యం అవుతుంది. భాషకూ-వ్యాకరణానికీ, ఛందస్సుకూ-కవితకూ, గీతానికీ-సంగీతానికీ, నృత్తానికీ-నాట్యానికీ, సర్వవిద్యలకేకాదు, భూలోకంలోనూ సర్వలోకాల్లోనూ వ్యవహృతాలయ్యే వాటి కన్నిటికీ మూలంగా యీ ఢక్కా నాదాన్నే స్వీకరించగలము. ఇటువంటివాటిని నమ్మకాలంటామా? వీటికేమైనా ఆధారముందంటామా? నమ్మకాలని పెడచెవినిపెట్టి, అప్రామాణికాలని త్రోసిపుచ్చి, కేవల భౌతికవాదులుగా మన పండిత విమర్శకులు నిలిచి మాట్లాడుతారా అంటే అది పూర్తిగా సందేహాస్పదం. అయినప్పుడు దేవయోనులైన యక్షులు యక్షగానం చేశారంటే నమ్మలేమా? అసలు దానిలో స్వల్పంగాగాని, సందేహాస్పదంగాగాని, అనిర్ణీతంగానైనాగాని ఆలోచించవలసినదేమైనా వున్నదా అని కూడా శంకించలేమా!

## యక్షుల భౌమా భౌమత్వం

కుబేరుడు దేవయోని అయిన యక్షుడే అనుకుందాము. అలౌకికమైన దృష్టిని విడచి, లౌకికమైన దృష్టితోనే ఆలోచించుదాం. కుబేరుడు నరవాహనుడు కదా! అతడు, లేదా అతనిజాతి యక్షగానం చెయ్యకూడదా? నరవాహనం మాట కాదు. అసలు మనుష్య ధర్మం కలవాడే యీ యక్షరాజు. నరవాహనుడనే పేరుతో పాటు మనుష్యధర్ముడన్న పేరు కూడా యక్షరాజైన కుబేరునకున్నది కదా! ఈ విషయాన్ని నమ్మకుండా వీటిని పర్యాయ పదాల్లో చేర్చుకుని ఎట్లా వాడుకుంటాం? అసలు వీటిని పర్యాయనామాలుగా ఎందుకామోదించారు! మరి కుబేరుడు, కుబేరాదులు మనుష్యగానాల్లో ఒకటైన యక్షగానం గానం చేయడంలో మానవ ధర్మమే వున్నదిగాని అమానుషత్వానికి తావు లేదుగదా!

రాక్షసులకంటే పూర్వం యక్షులు సింహళాన్ని పరిపాలిస్తూ వుండేవారని, బలిచక్రవర్తి సేనాని అయిన 'సుమాలి' యక్షులనోడించి రాక్షస రాజ్యాన్ని అక్కడ స్థాపించాడని ఒక కథ ఉన్నట్లు—కొంతకాలం తరువాత రాక్షసులు నశించడంతో తిరిగి సింహళంలో యక్ష రాజ్యం ఏర్పడినట్లు—మహావంశం అన్న గ్రంథాన్ని ఆధారంగా చేసుకుంటే క్రీ. పూ. 5వ శతాబ్దివరకు యక్ష రాజ్యం అక్కడ కొనసాగిందనీ, శ్రీ వి. ఆర్. ఆర్. దీక్షితార్ గారు ఒక వ్యాసంలో పేర్కొన్నారు. ఈ వ్యాసంలోనే శ్రీ దీక్షితార్ గారు "యక్షులనేవారు దేవయోనులేకాక

మానవులవలె భౌమ జీవులై కూడా వుండేవారని తెలుస్తున్నది'' అని పేర్కొన్నారు. ఇది యథార్థంగానే కన్పిస్తున్నది. బ్రహ్మవైవర్త పురాణం, శివపురాణం, ఉత్తర రామాయణాలలోని కథలు పరిశీలిస్తే దేవయోని అయిన కుబేరుడే మానవునివలె భౌముడుగా జీవిస్తూండిపినట్లు తెలుస్తుంది.

కుబేరుడికి అనేక జన్మలున్నట్లు స్పష్టమవుతోంది. కుబేరుడిని గుహ్యకేశ్వరుడన్నారు. గుహ్యకులలో యితడు మొదటివాడు కాబట్టి యీ మాట అన్నారు. గుహ్యకులు శ్రీకృష్ణుని గుహ్యప్రదేశం నుంచి జన్మించినట్లు బ్రహ్మవైవర్త పురాణ వాక్కు. ఈ గుహ్యకేశ్వరుని వామ పార్శ్వం నుంచి ఒక కన్య పుట్టింది. మనోహర అయిన ఈ కన్యపేరు మనోరమ. ఈ మనోరమనే కుబేరుడు అర్థాంగిగా స్వీకరించాడు.

యజ్ఞదత్తుడనే బ్రాహ్మణుని కుమారుడైన గుణనిధి అన్న వ్యక్తి శివప్రసాద మహిమ వల్ల విష్ణు లోకంలోకి వెళ్ళి కుబేరుడై పుట్టాడు. ఆ తరువాత యీ కుబేరుడు మరొకజన్మలో కళింగ దేశాధీశుడైన అరింధముడనే రాజుకు 'దముడ'న్న పేరుతోపుట్టి రాజ్యం చేశాడు. కానముడు దముడుగానే వుండకుండా, నిజంగా కుబేరుడే అయినట్లు కనిపిస్తోంది. ఇతడు దేవాలయాల్లో ఎప్పుడూ దీపారాధన చేయించేవాడు. కాశీలో విశ్వేశ్వరుణ్ణి ప్రార్థించగా యితనికి పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమయ్యారు. మహాతేజోమయులైన వారిని చూడలేక 'మిమ్మల్ని దర్శించే భాగ్యం ప్రసాదించమ'ని ప్రార్థించాడు. ఆ భాగ్యాన్ని శివుడనుగ్రహించాడు. దముడు పార్వతీ సౌందర్యాన్ని చూచి ఆమెను వర్ణించడం మొదలుపెట్టేసరికి పార్వతికి కోపం వచ్చింది. దానితో దముని నేత్రం ఒకటి పగిలిపోయింది. 'నన్ను క్రూర దృష్టితో చూచిన వీడెవడ'ని పార్వతి భర్తనడుగగా 'వీడు నీకు పుత్రుని వంటివాడు. మన భక్తుడు. నువ్వు వీణ్ణి అనుగ్రహించు'అని చెప్పాడు. ఆమె అనుగ్రహించి యితని దృష్టి చెడకుండా వరమిచ్చింది అది మొదలు యితని కుడి కన్ను పిశఙ్గాక్షం అయింది. ఈ దముడికి–అంటే కుబేరుడికి–అలకాపట్టణాన్ని, ఉత్తర దిగధిపత్యాన్ని, పరమేశ్వరుడనుగ్రహించాడు. తన స్నేహితుడుగా కూడా స్వీకరించాడు.

మరొక జన్మ. కుబేరుడు విశ్రవోబ్రహ్మ కుమారుడు. ఇతని తల్లి ఐలబిల. విశ్రవోబ్రహ్మ బ్రహ్మ మానస పుత్రుడైన పులస్త్య బ్రహ్మ కుమారుడు కుబేరుడు తండ్రినీ, తాతనూ విడచి, పితామహుడు అయిన బ్రహ్మను గూర్చి తపస్సు చేసి అతిలోక సుందరుడైన నలకూబరుడన్న కొడుకును, లోకపాలకత్వాన్నీ, ధనేశ్వరత్వాన్నీ, పరమేశ్వరునితో స్నేహాన్నీ, లంకాధిపత్యాన్నీ, వరాలుగా స్వీకరించాడు. ఇతనిమీద పులస్త్యునికి కోపం రావడం మొదలైన విషయాలు యింతకుముందొకసారి పేర్కొనడం జరిగింది కుబేరుడు విశ్రవసుకు సమర్పించిన నృత్యగీతజ్ఞులైన కన్యలపేర్లు 'పుష్పోత్కట', 'మాలిని', 'రాక'. విశ్రవసుకు పుష్పోత్కట యందు పుట్టినవారే రావణ కుంభకర్ణులు. రావణుడు పులస్త్య బ్రహ్మ కొడుకన్నది వేరు కథ. రావణుని తల్లి కైకసి అని మరికొన్నిచోట్ల పేర్కొనబడింది. కుబేరుడు పుష్పక విమానం ఎక్కి విహరిస్తూంటే ఆ విమానాన్ని లాక్కోవలసిందిగా, తల్లి రావణునికి చెపుతుంది. అంతకంటె గొప్పదాన్నే సంపాదిస్తానని రావణుడు తపస్సుకు

వెడతాడు. అతడు తపస్సునుంచి తిరిగి వచ్చింతరువాత సుమాలి వచ్చి 'లంకలో పూర్వం మేం వుండేవారం. మమ్మల్ని దేవతలు వెళ్లగొట్టారు. ఇప్పుడు లంక కుబేరుని స్వాధీనంలో వున్నది, తిరిగి రాక్షసుల రాజ్యం రాక్షసుల కిప్పించాలని' అంటాడు. వెంటనే రావణుడు లంకను రాక్షసుల కప్పగించవలసిందిగా కుబేరుడికి కబురు పంపాడు. ఈ విషయం కుబేరుడు తన తండ్రికి విన్నవించి తనకు నివాసయోగ్యమైన పట్టణం చూపించమంటే తండ్రి కైలాసానికి వెళ్లమంటాడు. కుబేరుడు కైలాసం వెళ్లి అక్కడ శివునితో స్నేహంగా వుంటాడు. శివుడితనికి అలకా పట్టణాన్ని యిచ్చాడు. శివుని తొడమీద పార్వతి కూర్చునివుండగా "ఆమె అదృష్టం ఏమి?" అని యీర్ష్యపడి కుబేరుడు కుడికంటితో వోరగా చూస్తాడు. అందువల్ల అతని కుడికన్ను పగిలిపోతుంది. కుబేరుడు విచారపడి తపస్సు చేస్తాడు. శివుడు మెచ్చి అతనికి దృష్టినిచ్చి ఆ పగిలిన కంటికి పింగళ వర్ణం వస్తుం దన్నాడు. (గచ్చకాయరంగు) కాగా, కుబేరుడు పింగాక్షుడయ్యాడు.

లంక విడిచి వెళ్లిన తరువాత కుబేరుడు 'నీ దుశ్చేష్టలకు లోకాలు గర్హిస్తు న్నాయి. నీవు వాటిని మానివెయ్యి.' అని రావణునికి కబురు చేశాడు. కుబేరుడు నాకు నీతి బోధలు చేసేటంతటివాడా? అని రావణుడు అతనితో యుద్ధం చేసి అతని పుష్పక విమానం లాక్కున్నాడు.

ఈ కథల వల్ల దేవయోని అయిన యక్షరాజు జన్మాంతరాలలో కూడా యక్షరాజశక్తిని కోల్పోకుండానే భౌమ జీవుడుగానే జీవించినట్లు స్పష్టమవుతోంది. అతని నేత్రం పగిలిపోవడం, ఆ నేత్రానికి గచ్చకాయరంగు రావడం కాకమ్మ కథగా త్రోసిపుచ్చుదామా అంటే అంత తేలిగ్గా త్రోసిపుచ్చడానికి వీల్లేనిదిగా కన్పిస్తున్నది. గచ్చతీగెకు యక్షాక్షి, కుబేరాక్షి అన్న పేర్లు ఎన్నో సంవత్సరాల నుంచి ఆయుర్వేదశాస్త్రాల్లో కనిపిస్తున్నాయి. అటు పురాణగాథలకు ఇటు ఆయు ర్వేదశాస్త్రాలకు విడదీయరాని ముడిపెడుతున్న యీ లంకెను ఎలా ఛేదించగలం?

ప్రత్యేకించి కళింగరాజ్యాధినేత అయిన అరిందమునికుమారుడుగా, దముడుగా పుట్టాడన్న విషయం చూస్తే ఆంధ్రులకు, కుబేరుడికీ, కుబేరజాతికీ, సంబంధం ఉండి తీరాలన్న విషయం తేటతెల్లమవుతోంది. కళింగులు, ఆంధ్రులు భిన్నులన్న అభిప్రాయం కొందరిలో వున్నా ఒక విధంగా వీరు అగర్భ సోదరులే! విశ్వామిత్ర శాపదష్టులైన పుత్రులు ఆంధ్రులయ్యారని కథవున్నా ప్రముఖ వేద ఖగోళశాస్త్ర జ్ఞుడైన మహర్షి దీర్ఘతముని (మామతేయుడు) పౌత్రులుగాకూడా ఆంధ్రజాతి ఒకటి వున్నట్లు స్పష్టమౌతున్నది. "బలి భార్య అయిన సుధేష్ణకు దీర్ఘతమ మహర్షి సంయోగానుగ్రహంతో అంగరాజు జన్మించాడు. ఈ అంగరాజుకు వంగ, కళింగ, సింహ, ఆంధ్ర పుత్రులు కలిగారు," అని భారత భాగవతాలు పేర్కొన్నాయి. కాగా, వంగులు, కళింగులు, సింహులు, ఆంధ్రులు అన్నదమ్ములన్నమాట! ఒక తండ్రి బిడ్డలేనన్నమాట! దీర్ఘతముని వంశీయులైన కళింగులు పాలించిన దేశాధీశు డైన అరిందమునికి పుత్రుడై పుట్టిన దముడు కుబేరుడై అలకాధిపత్యాదులు పొందినా, కళింగుడే కదా! తొలుత పరిస్థితి ఏమైనా కళింగాంధ్రాలు దేశపరంగా వొక్కటే! మఱి యక్షరాజైన కుబేరుడు ఒకప్పుడు పరిహృష్ట దేశమైన కళింగ

దేశంలో వున్నా ఆంధ్రుల సోదరుడుగా తరువాతి ఆంధ్రదేశంలో వున్నట్లే కదా ! కాగా అత్యంత ప్రాచీన కాలంలోనే దేవయోని భేద జీవులైన యక్షులతో కళింగాంధ్రులకు సంబంధ బాంధవ్యాలున్నట్లు విస్పష్టంగా అర్థమవుతున్నది. దీర్ఘతమ మహర్షి వంశీయులైన వంగ, కళింగ, సింహాంధ్రుల విషయమూ, కళింగాధిపుడైన అరిందముని పుత్రుడైన నముని కుబేరత్వ విషయమూ, తమ దృష్టికి రానందువల్ల కాబోలు, కీర్తిశేషులు శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు "యక్షులు 'అక్షస్' (Oxus) నదీ ప్రాంతం వారో, లేదా 'యఛి' (Yuchi) అనే మంగోల్ జాతి వారో, లేదా 'జక్షార్తస్' (Jaxartes) ప్రాంతం వారో అయి వుంటా''రని కొన్ని అభిప్రాయాలున్నట్లు ప్రతిబింబించారు.

బలిచక్రవర్తి సేనాని అయిన సుమాలి యక్షులనోడించి రాక్షసరాజ్యము స్థాపించినట్లు యింతకు ముందు శ్రీ దీక్షితార్ భావాన్ని పేర్కొనడం జరిగింది. పరిశీలిస్తే యీ సుమాలి రాక్షసుడుగా కనిపించడం లేదు. ఇతనికి యక్ష గంధ ర్వులతో బంధుత్వమున్నట్లుకూడా కనిపిస్తున్నది. 'సుకేశుడు' గ్రామణి అన్న గంధ ర్వుని కూతురు 'దేవవతి'ని వివాహం చేసుకోగా పుట్టినవాడు సుమాలి. ఒక గంధ ర్వరాజ పుత్రియైన 'కేతుమతి'ని యీ సుమాలి వివాహం చేసుకున్నాడు. వీరిద్ద రికీ కలిగిన సంతానంలో బాల, పుష్పోత్కట, కైకసికుంభీనస పుత్రికలుకూడా ఉన్నారు. నృత్యగానాదివిద్యలలో ప్రవీణలైన పుష్పోత్కట ప్రభృతి కన్యలను కుబేరుడు విశ్రవసుకు సమర్పించిన విషయం గతంలో గుర్తించాం. మొత్తం మీద సుమాలికీ, యక్షులకూ సంబంధం కనబడుతున్నది. అయితే "సుమాలి" రావణు నాశ్రయించి కుబేర రాజ్యాన్ని రాక్షసుల పరంచేశాడో - బలిసేనానిగా ఉండి తానే యుద్ధం చేసి సంపాదించాడో స్పష్టంగా చెప్పలేము. గెలుపు ఓటముల్లో యేది ముందయితేనేమిగాని యే విధంగా చూచినా ఒకసారి ఓడినట్లు మరొక సారి గెల్చినట్లు అర్థమవుతున్నది. కుబేరుడు బలిచక్రవర్తి నుంచి తన సంపదను తిరిగి సంపాదించాడని, అందువల్లనే దీపావళిని యక్షరాత్రిగా దివ్యంగా ఉల్లాసంగా, గడిపేవారని, 'ముళియ తిమ్మప్పయ్య' అన్న కన్నడ విమర్శకులు పేర్కొన్నారు.

### యక్ష రాత్రి

యక్ష రాత్రిః, కౌముదీ జాగరః, సువసంతకః సహకార భంజికా, అభ్యూ షఖాదికా, బిసఖాదికా, నవ పత్రికా, ఉదక క్ష్వేడికా, పాంచాలానుయానం, ఏకశా ల్మలీః, యవ చతుర్థీ, ఆలోలచతుర్థీ, మదనోత్సవః, దమన భంజికా, హోలాకా, అశోకోత్తంశికా, పుష్పావచాయికా, చూతలతికా, ఇక్షుభంజికా, కదంబ యుద్ధాని, తాస్తాశ్చ మాహిమాన్యః, దేశాశ్చ క్రీడాజనేభ్యో విశిష్ట మాచరేయురితి సంభూయక్రీడాః, (1-4-42).

అని వాత్స్యాయన కామసూత్రంలో "యక్షరాత్రి" అన్న శబ్దాన్ని ఉప యోగించాడు. దీనికి పక్షరాత్రి అన్న పాఠాంతరం ఉన్నప్పటికీ "యక్షరాత్రి" అన్నది అసలు లేకపోలేదు. దీనికి ద్యూతక్రీడ అని కొందరు యేదో మరి ఒక క్రీడ అని మరికొందరు అర్థాలు చెప్పారు కాని అది సరియైనదిగా కన్పించదు. అసలు వాత్స్యాయన కామసూత్రాలు స్వతంత్ర గ్రంథంకాదు. నంది అతని తర్వాత బాద్రా

లకుడైన శ్వేతకేతువు ఆ తర్వాత బాభ్రవ్యాదులు రచించిన అనేక గ్రంథాల మీద ఆధారపడి అతి సంగ్రహంగా వాత్స్యాయనుడు దీన్ని రచించాడు. అయినా మోక్షగామిత్వాన్నికూడా కామంగానే భావించి అర్థకామ విజ్ఞాన తత్వాన్ని వాత్స్యాయనుడు ఆవిష్కరించ నేలేదు. అసలు క్రీడ అనేదే రాను, రాను అర్థ పరిణామం చెందింది. మొట్టమొదట పవిత్రోత్సవయాత్రా క్రీడలకూ సతీపతుల, ప్రేయసీప్రియుల శృంగార విలాస పూరితాలైన క్రీడలకూ ఈ శబ్దం ఉపయో గించబడేది. అయినప్పటికీ వాత్స్యాయన సూత్రంలో కూడా ద్యూతక్రీడకు సంబం ధించినదిగా ఉపయోగింపబడలేదు. యశోధరాదులు సరిగా గుర్తించలేదుగాని ఈ క్రీడలు మహిమాన్వితాలని ఇవైనా మామూలువారు కాక విశిష్టులైన వారు ఆచరింపవలసినవని వాత్స్యాయనుడు పేర్కొన్నాడు ఈ క్రీడలుకూడా దైవారాధ నాది ఉత్సవాలతో కూడుకున్నవే కాని కామ (సంగమ) పరమైనవికావు. అసలు వాత్స్యాయన కామసూత్రాలు యశోధరునికి సరిగా అవగాహనమైనట్లు కనప డదు-ప్రథమ సూత్ర వ్యాఖ్య మొదలు అంత్యసూత్రవ్యాఖ్య వరకూ ముఖ్య మైనచోట్లల్లా లోపాలే కన్పిస్తున్నాయి.

యక్షరాత్రికి దీపావళి అని కొందరర్థం చెప్పగా కార్తీక పౌర్ణమి అని మరికొందరు చెప్పారు. దీపావళికి సంబంధించిన కథల్లో యక్షప్రసక్తి పురాణాల్లో మృగ్యం. నరకాసురవధ, బలిచక్రవర్తి విష్ణువుకు రాజ్యదానము చేయటం, శ్రీరాముడు రావణ సంహారానంతరం అయోధ్యకు వచ్చి భరతునితో కలవడం, విక్రమార్క చక్రవర్తి పట్టాభిషేకోత్సవం అన్నకథలు దీపావళి సందర్భంగా కన్పిస్తున్నాయి. పురాణాల్లోనూ, ధర్మశాస్త్రవ్రత గ్రంథా ల్లోనూ నరకాసురకథయే తరచుగా కన్పిస్తున్నది. అయితే కార్తీక పౌర్ణమిమాట విడచి దీపావళి అమావాస్యనాడే కౌముదీ మహోత్సవం కొందరు జరుపుకుంటు న్నట్లు ముద్రారాక్షసాది గ్రంథాలవల్ల అర్థమవుతున్నది. బలిచక్రవర్తిని విష్ణువు మూడడుగుల దానం కోరడంతో పాతాళలోకానికి పంపిన విషయం లోకవిదితం. అయితే కన్నడ విమర్శకులైన శ్రీ తిమ్మప్పయ్య పేర్కొన్నట్లు కుబేరుడు బలిచక్ర వర్తిని ఓడించి తన సంపదను తిరిగి సంపాదించుకున్న రోజు దీపావళి అని, అందు వల్లనే దాన్ని యక్షరాత్రిగా పేర్కొన్నారనీ అనడానికి పురాణాలలోగాని, ధర్మ వ్రత గ్రంథాదులలోగాని ఆధారం కనబడడంలేదు. యక్షిణులలో తులసి యక్షిణి చాలా శక్తివంతమైనదిగా మంత్ర తంత్ర శాస్త్రాల ఆంతర్యం అవగాహన చేసు కుంటే బోధపడుతుంది. ఈ సందర్భంలో కృష్ణతులసి కంటే లక్ష్మీతులసి మరింత శక్తివంతమైందిగా శాస్త్రం చెపుతుంది. పూర్వకాలంలో కార్తీక పౌర్ణమినాడు తులస్యుద్వాసన మహోత్సవం జరిపేవారు. ఈ ఉత్సవాన్ని యక్షులుకూడా పూజాది కార్యక్రమాలతో నిర్వహించేవారేమో. అందువల్లనే కార్తీక పౌర్ణమికి యక్షరాత్రి అన్న పేరు వచ్చిందేమోనన్న అభిప్రాయం కలుగుతున్నది. శ్రీకృష్ణ మహావిష్ణువులకే పూజనీయమై పరమ పవిత్రమైన తులసి యక్షులకు పూజనీయమవ డంలో ఆశ్చర్యంలేదు. ఈ యక్షరాత్రి ఉత్సవాలలో వారు చేసే నృత్యగీతాదు లకు "యక్షగానం" అన్న పేరు రావడం అసహజం కాదు.

"యక్ష" శబ్దానికి వికృతి పరంగా తెలుగులో జక్కులు—జక్కిణివంటి శబ్దాలను విమర్శకులు పరిగ్రహించారు. ఈ శబ్ద ప్రయోగాలను దృష్టిలో పెట్టుకుని కూడా పండితులు యక్షగాన చరిత్ర నూహించాలని ప్రయత్నించారు జక్కులు శబ్దాన్ని యక్షులుకు పర్యాయంగా పూర్వకవులనేకమంది ప్రయోగించారు. జక్కువీడు (జక్కుల జాతివాడు), జక్కులరేడు (కుబేరుడు) ఇత్యాదిపదాలను సైతం పూర్వకవులు ప్రయోగించారు. "జక్కిని" అంటే కుబేరుని భార్య అనీ "జక్కిణి" అంటే జాతి విశేషం అని కొందరు భావించగా అనేకమంది పూర్వకవులు నృత్య విశేషం—నాట్యభేదం అన్న అర్థాల్లో కూడా యీ పదాన్ని ప్రయోగించారు. సంగీతంలో ఒక వర్ణ విశేషం—ఒక విధమైనపాట అన్న అర్థంతో కూడా విష్ణు పురాణాదులుపయోగించాయి.

గీతంబు లరువు జక్కిణి చిందు మొదలుగా
నొక్కొక్క వర్ణంబు నుగ్గడించి (వి పు 7.277)

"జక్కి" శబ్దానికి గుర్రం అని "కట్టువడిపోవడం" అనీ అర్థాలున్నాయి. చివరికి "జక్కిమోర" అన్న శబ్దం తెలుగులో (అశ్వముఖులకు) కిన్నరులకుపయోగించారు పూర్వులు. "జక్కి ఒడలు" వంటి పదాలను గూపొందిస్తే కింపురుషులు (నరముఖం-అశ్వ శరీరం కలవారు) అని కూడా అర్థం వస్తుంది. జక్కులు బహు వచన రూపం చూస్తే దాని ఏకవచన రూపం విస్తృతవ్యవహారంలో లేకపోయినా "జక్కి" ఉన్నదని స్పష్టపడుతుంది-అసలు "యక్ష" శబ్దమే "యక్షి" అయి "జక్కి" గా మారిందని స్పష్టంగా అర్థమవుతున్నది—నృత్య గానాలకు గంధర్వులు ప్రసిద్ధులుగా ప్రసిద్ధమైనా యక్షకిన్నర కింపురుషులంతా నృత్యగాన తత్వజ్ఞులేనన్న విషయం తుంబురాదుల చరిత్రల వల్లనే అర్థమవుతున్నది

"యక్షిణీ విద్య" అని "యక్షిణి" అని కనికట్టు విద్యపట్ల ఇంద్రజాలం పట్ల ఉపయోగిస్తాము. లేనిదానిని ఉన్నట్లు చూపడం కనికట్టు విద్యలక్షణం — యక్షుల కామ రూపత్వం ఇటువంటి విద్యలన్నింటికీ మూలమనడంలో సందేహం లేదు — "జక్కి" అంటే "కట్టువడిపోవడం" అని తెలుగులో అర్థం ఉన్నదని పేర్కొన్నాను. దానికి మూలరూపమైన "యక్ష" శబ్దానికి కూడా "కట్టిపేసేవాడు" అని అర్థం వున్నది. వివిధ విద్యలతోపాటు నృత్యగానాదివిద్యలతో కూడా కట్టివేయగలవారు-తన్మయాంబుధిలో ముంచగలవారు కాబట్టే వారికి "యక్షు" లన్న పేరు వచ్చి వుండవచ్చు-ఈ శక్తులకు మూలం వారి కామరూపత్వమేనన్నా వచ్చే విప్రతిపత్తి లేదు-ఇంతటి శక్తికలవారు. కాబట్టే గంధర్వాదులంతా యక్షులతో సంబంధబాంధవ్యాలు నెరపుకున్నారేమో! గంధర్వాదులంతా అని యెందుకంటున్నానంటే కుబేరుని పుత్రుడైన నలకూబరుణ్ణి వరించి ఆకట్టుకున్న "రంభ" అప్సరోవనిత కదా!

అసలు "యక్షగాన" మంటే యక్షులగురించి చేసే గానం యక్షులుచేసే గానం-యక్షులుగానం చేసినట్లు చేయబడే గానం అని అర్థాలు. యక్షులుచేసేగానం యేదైనాకావచ్చు - వారినమకరించి చేసేది యేదైనాకావచ్చు - యక్షుల గురించి చేసేది అంటే యక్షుల ప్రీతికై చేసే గానం కావచ్చు. కేవలం యక్షుల గాథలే గానం చేసేదీకావచ్చు - యక్షుల ప్రీతికి యక్షులగాథలేకాక యితర గాథలూ వారి

క్లిష్టమైనవి గానం చెయ్యవచ్చును ఈ దృష్ట్యా గానయోగ్యమైన ప్రబంధం యేదైనా సరే కావ్యమేదైనా సరే "యక్షగాన" మనడానికి సమర్థమైన దన్నమాట.

## జక్కులు — యక్షగానాలు

లోగడ జక్కు - జక్కులు - జక్కిని - జక్కిణి శబ్దాలవిషయం కొంత ప్రస్తావించబడింది - జక్కులకు యక్షగానాలతో సంబంధం వున్నట్లు కొందరూహించారు. యక్ష శబ్దప్రాకృత రూపంనుంచి సంజనితమైనందువల్ల జక్కులు రూపం కన్పిస్తున్నది గాని అన్యథాసంస్కృత భవంగానే రావాలంటే "యెచ్చులు" వంటి రూపం రూపొంది ఉండేది - పామరుల ఉచ్చారణలో "క్ష" కారం సామాన్యంగా "చ్చ" కారంగా పరిణమిస్తుంది. రాక్షసులు - అనడానికి బాన్ని అనలేకపోతే మామూలు మనిషి "రాచ్చసులు" అంటాడేతప్ప భిన్నంగా ఉచ్చరించడు. రాకాసి - రక్కసి రూపాల మాట వేరు. యక్షులు కేవల నృత్య నాటకగానాదులు వృత్తిగా కలవారు కాదు. పదవికృతిలో అర్థపరిణామం అర్థవికృతి సహజమే. అయినా జక్కులన్న జాతి పూర్వం కొంత నృత్యగానాలలో జీవితం గడిపినట్లు కనిపిస్తున్నా కూచిపూడి భాగవతులవలె వృత్తిగావారు నాటకాలాడిన సందర్భాలు సకృత్తుగానైనా కానరావు - జక్కులు కళావంతుల తెగకు సంబంధించినవారని కొందరభిప్రాయపడ్డారు గాని అది సరికాదు. కళావంతులు బోగం వారికి చెందినవారే - బోగం వారినే కళావంతులుగా మర్యాదగా వ్యవహరించడం జరిగింది. అయితే యేకాలంలోనూ కూడా జక్కులకు యీ కళావంతులైన లేదా కళావంతులనబడిన బోగంవారితో యే విధంగానూ సంబంధ బాంధవ్యాలున్నట్లు కనపడదు. జక్కులకు - ప్రత్యేకించి జక్కిణులకు నృత్యగానాలతో సంబంధం ఉన్నదనడానికి ప్రాచీన ఆంధ్ర కావ్యాలలో సమృద్ధిగా ఆధారాలున్నాయి. కళావంతులలో కొందరు కన్యలు నృత్యగానాలునేర్చి దైవాంకిత జీవితం గడుపుతూ "దేవదాసీ" లుగా పేర్కొనబడ్డవారివలే "జక్కుల కన్నెలు" కూడా "దేవదాసీ" లవలె శివపరంగా అంకితమై జీవితం గడిపేవారని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వివరించిన కామేశ్వరి కథనుబట్టి తెలుస్తున్నది. ఏమైనా నృత్యగాన సంబంధాలున్నంత మాత్రంచేత "జక్కులు" నామమున్నంత మాత్రం చేత వారికి యక్షగానాలతో - అటు కావ్యగాన పఠనాలతోగాని నాటకాలతోగాని సంబంధం వున్నట్లు నృథంగా చెప్పలేము.

ద్రవిడదేశ నృత్య ప్రబంధ విశేషమైన కురవంజినుంచి యక్షగానం అవతరించిందన్న వాదం లేకపోలేదు. కురవంజికి యక్షగాన నాటకానికి కొన్ని సామ్యాలున్నమాట వాస్తవమే.

అంతమాత్రంచేత కురవంజినుంచి యక్షగానం రూపొందిందని చెప్పలేము. ఆంధ్ర కర్ణాట ద్రవిడదేశాల అరణ్యప్రాంతాలలో వసించే కురవజాతి (అంజి-అడుగు) నృత్య విశేష పరిణామమే కురవంజి అని శ్రీ వేటూరివారు పేర్కొన్నారు. తెలుగులో యెరుకులకురవంజి ఉన్నది. ఇది యెరుకులకాదు "యదుకుల" అని కొందరు భావించారు. ఇది "యెరుకుల" అయినా "యదుకుల" అయినా కురువంజి - లేదా యక్షగానం యక్షులైన జక్కులకు - యెరుకులకూ - యదుకులకు మాత్రమే పరిమితమై వున్నట్లు కనపడదు - కురవంజి ఒక ఆటవిక జాతి

నుంచి ఆవిర్భవించిందే అయితే అటు యెరుకులకు వ్యాపించిందని చెప్పవచ్చుగాని "యదుకు"లకు వ్యాపించిందని చెప్పగలమా? యదువంశవువారు ఆటవికులు కారుగదా! అసలు నృత్యగానాలు ఒక్క జక్కులకే పరిమితమైలేవు - అవియే నృత్యగానాలైతేనేమిగాని యెరుకులకు యానాదాది తదితర జాతులకు కూడా వ్యాప్తిచెందే వున్నాయి. అతిపురాతనకాలంనుంచి యెరుకులు యానాదులు మొదలైనవారు వేషాలువేసి పాటలు పాడుతూ ఆడుతూవుండే వారనడానికి వారి వారి చరిత్రలే ఆధారాలుగా ఉన్నాయి - కాగా నృత్యగానాలు జక్కులకే పరిమితంకాదని అర్థమవడం లేదా? మనం గుర్తించవలసిన విషయాలు ఒకటి రెండు ముఖ్యమైనవే ఉన్నాయి. కురవంజి జాతి పరమై వచ్చిందా లేక రాగపరమై వచ్చిన రచన నామమా అని సందేహం కల్గుతున్నది - మార్గ సంగీత మనబడిన దానిలో 29వ మేళకర్త ధీరశంకరాభరణ రాగంనుంచి "కురంజి" అని రాగం జనించింది. దీనికి ఆరోహణావరోహణ లీ క్రింది విధంగా ఉంటాయి.

ఆరోహణం — స, ని, స, రి, గ, మ, స, ధ

అవరోహణం — ధ, ప, మ, గ, రి, స, ని, స

ధైవతాంత్యరాగాలలో దీన్ని శాస్త్రజ్ఞులొక మంచి ఉదాహరణగా స్వీకరిస్తారు. యీ విధంగానే 39వ మేళకర్త అయిన "ఝాలవరాళి" జన్యమైన "కురంజి విజయ" రాగం మరొకటి ఉన్నది. దీనికి

ఆరోహణం — స, రి, మ, గ, రి, మ, ప, ధ, స

అవరోహణం — స, ని, ధ, ప, రి, స

అని వుంటాయి.

ఒక ద్రుతం—ఒక ఖండ లఘువు, ఒక త్రిశ్రలఘువుతో కలిసివున్న ఒక విధమైన తాళం వున్నది. దీన్ని "కురు ఝంపె" అంటారు. ఈ తాళం మీద ఆధారపడి యక్షగానాల్లో "కురుచ ఝంపె" అన్న పేరుతో ఒక తాళం ఉపయోగిస్తారు - ఇదేవిధంగా "ఎరుకుల ఝంపె" అన్న పేరుతో యక్షగానాల్లో వాడబడే ఒక విధమైన తాళానికి దీనికి సంబంధం ఉన్నది - "ఎరుకుల" అని కొందరు "యదుకుల" అని మరికొందరు భావించినా "యెరుకుల కాంభోజి" లేదా "యెరకల కాంభోజి" అన్న పేర్లతో కూడా ఒక రాగం వున్నది. యక్షగాన పరాలైన యీ రాగ తాళాలను పరిశీలిస్తే "కురవంజి" నామం జాతి పరమైకాక సంగీత శాస్త్ర పరమై యేర్పడిందేనా అన్న సందేహంకల్గుతున్నది-"కురంజి" శబ్దం "కురవంజి"గా మార్పు చెందడంలో వింతయేమీ ఉండదు. ఒక దరువు ఒక ఆట, పాటయై—క్రమంగా కొన్ని దరువులతో—కావ్యాలవలె— ఒక కథ నడచి తుదకు వివిధ రాగ తాళ బద్ధాలైన దరువులతో—రూపకాలవలె—యక్షగాన నాటకం రూపొందినట్లు — కురంజి రాగంతో కీర్తన గాన నృత్యాలు ప్రారంభమై అదే కథాపరమై చివరికి "కురువంజి" — యక్షగానం వంటి నాటకంగా రూపొందిందా అనిపిస్తున్నది. యక్షగానాలలో ప్రత్యేకించి "యెరుకల" శబ్ద సంబంధం కల రాగ తాళాలు ఉపయోగింపబడడం—కొన్ని యక్షగానాలలో కురవంజి పాత్ర రూపుదాల్చడం చూడగా

యిది ప్రత్యేకించి ఒక జాతిపరమైనగాని ఒక జాతినంటిపెట్టుకునిగాని విస్తృతవ్యాప్తి నొందిందని చెప్పే అవకాశాలు తక్కువ. యక్షప్రియ రాగ పరమైన రచన క్రమంగా యక్షగానమైనట్లు—కురవంజిరాగపరమైన రచనాక్రమంగా ''కురవంజి''గా కొద్ది అక్షరపు మార్పుతో రూపొంది ఉండవచ్చును. యక్షుల విషయం విడచి చూస్తే యక్షగానాలు ఏదో ఒక జాతికిచెందినవని మాత్రం కావని నిస్సంశయంగా చెప్పవచ్చు—వీటితో జక్కులకు మాత్రమే సంబంధం ఉన్నదనిగాని యెరుకలు, యానాదులు వంటి వారికి మాత్రమే సంబంధం ఉన్నవనిగాని దృఢంగా చెప్ప లేము. తద్భిన్నులైనవారుకూడా వీటితో సంబంధం కలవారే—ఒక్క జక్కుల—యెరుకులవారు మాత్రమే యక్షగానాలు పాడి ఆడేవారనడానికి ఆధారాలు చాలా తక్కువ, వారుకూడా యక్షగాన నాటకాదుల్లో పాల్గొన్నారనడం నిస్సందేహం —

## మార్గ - దేశి - భేదాలు ?

''యక్షగానం'' అన్నది దేశి రచన మాత్రమేననీ మార్గ రచన — అంటే సంస్కృతంలో మొదట అవతరించిన రచన—కాదనీ చెక్కుమంది విమర్శకులు భావించారు. కాని ఇది అంత తేలికగా నిర్ణయించడానికి వీలైనదికాదు. పరిశోధించిన కొద్దీ, భాష విషయంలోనే మార్గ—దేశి భేదాలున్నాయనుకున్నా దేశికి వ్యక్తిత్వం నిలవడం కష్టంగానే కన్పిస్తున్నది. అసలు తొలుత సంగీత నాట్యాలపరంగా యీ మార్గ—దేశి శబ్దాలు ఆయా శాస్త్ర గ్రంథాలలో ప్రయోగింపబడ్డాయి—బ్రహ్మ పరమేశ్వరుని సమక్షంలో ఒక నాట్యాన్ని ప్రదర్శించినట్లు దాన్ని మార్గ సంగీత నాట్యాలుగా ప్రాచీనులు భావించినట్లు కనిపిస్తున్నది- దేశీయులైన ప్రజలు సృష్టించుకున్న రచన-సంగీత-నాట్యాదులు దేశీయాలుగా అంటే దేశిగా భావించడం జరుగుతున్నది — కాని వీటికి కూడా మూలం పరమేశ్వర ప్రబోధమైన విద్యలుగానే కనిపిస్తున్నాయి. బ్రహ్మసృష్టించినవి మార్గపరమైనవైతే ప్రజలుసృష్టించుకున్నవి దేశిపరమైనవైతే పరమేశ్వరసృష్టిగా అవతరించిన వాటి నేమానాలి? మార్గ—దేశికాక మరొకపేరుతో ప్రాచీనులు యెందుకు వ్యవహరించలేదో మరి! అయితే లోతుగా పరిశీలిస్తే పరమేశ్వరసృష్టినే దేశిగా పేర్కొన్నారా అందువల్లనే శైవులు దేశి రచనా నినాదాన్ని తద్రచనాభిమానాన్ని పెంపొందించుకున్నారా అని అనిపిస్తున్నది. ఏది యేమైనా పరిశోధించినకొద్దీ మార్గ—దేశులకు మధ్య అంతరం లేదనీ దేశి సంబంధమైన వేమైనా మార్గరీతికి విభిన్నమైనవి కావనీ నిరూపితమవుతున్నది. ఈ విషయమై ''మార్గ—దేశికవితలు'' అన్న నా పరిశోధనా గ్రంథంలో వివరంగా చర్చించి తగు నిరూపణ చేశాను.

ఛందస్సు పరంగా మార్గ—దేశి—భేదం లేనేలేదు. మార్గచ్ఛందస్సులో ఉద్ధురమాలావృత్తాదులు కాక సంజనితాలైన సమ — అర్ధసమ — విషమ వృత్తాలన్నీ 1\$510827389272314 సంఖ్యకు పరిమితాలనీ ఈ అనంతకోటి సంస్కృతచ్ఛందో రీతుల్లో మాత్రాబద్ధాలైన దేశి ఛందస్సులన్నీ అంతర్లీనం కాగలవనీ 1960 ఆగష్టు 15-21 తేదీల ఆంధ్రపత్రిల్లో ప్రకటితమైన వ్యాసాలలో నిరూపించి వున్నాను-

సంగీతపరంగా చూచినా మార్గదేశిభేదాల వివకాళం శాస్త్రీయంగా కని పించడం లేదు. దేశిప్రబంధమంటే దేశిసంగీతానికి సంబంధించిన ఒక సంగీత రచనఅనీ "దేశీతాళములు" అంటే దేశి సంగీతానికి సంబంధించిన తాళాలనీ కొందరు సంగీత శాస్త్రజ్ఞులే పేర్కొన్నా మార్గ సంగీతంలో దేశి అంతర్లీనమై వున్నట్లే విస్పష్టంగా కన్పిస్తున్నది. దేశకార - దేశీయతోడి - దేశీయరాగం-దేశి రాగం వంటివి ప్రత్యేకించి దేశీయాలని పేర్కొనబడుతున్నా వాటికి అమార్గత్వం కనపడడం లేదు. మనవారు కాపీరాగంగా పేర్కొన్నదాన్నే "దేశీయరాగం" గా ఔత్తరాహులు పేర్కొన్నట్లు కనిపిస్తున్నది. కాగా దేశిరాగాలుగా చెలా మణి అవుతున్న రాగాలను మార్గ రాగాలతో తులనాత్మకమైన సామ్యపరిశీలనం చేస్తే యీ దేశిరాగ వ్యవస్థ స్వతంత్రంగా నిలుస్తుందనుకొనడం సందేహా స్పదం - దేశకార, దేశఖ, దేశఖ్య, దేశదేశకాఖ్య, దేశముఖారి, దేశరంజని, దేశలగౌడ, దేశవరాళి, దేశవాళ, దేశ్య అంధాళి, దేశ్యకమాసు, దేశ్యకళ్యాణి, దేశ్యకానడ, దేశ్యకాపి, దేశ్యగానవారిధి, దేశగౌరి, దేశ్యగౌళ, దేశ్యతోడి, దేశ్యనాటకురంజి, దేశ్యనారాయణ, దేశ్యబంగాళ, దేశ్యబ్యాగడ, (దేశ్యబేగడ), దేశ్యమనోహరి, దేశ్యమాళవ, దేశముఖారి, దేశ్యరాగ, (దేశ్యరేగుప్తి), దేశ్యరేవగుప్తి, దేశ్యశ్రీ, దేశావాళి, దేశాక్షి, దేశాక్షరి, దేశికతోడి, దేశిక దేవగాన, దేశికబంగాళ, దేశికరుద్రి, దేశికిన్నరి, దేశినీ, ప్రభృతి నామకరాగా లన్నీ దేశ - దేశ్య, దేశి శబ్ద వాచ్యాలైనా మార్గ సంగీత జన్యరాగాలే - క్రియాతాళాది సాంకేతిక పదాలలో కూడా యీ దేశి శబ్దం మార్గలక్షణాలకు చిహ్నంగా నిలచింది-"దేశ్య క్రియ" అన్నప్పుడు దేశిపద్ధతిలోగల తాళాంగాలకు చెందిన ఒక క్రియగా భావించినా "దేశ్య క్రియాష్టకము"లను స్వీకరించ వలసివచ్చేసరికి మార్గమార్గాన్ని త్రోసిపుచ్చలేని ధ్రువక - సర్పిణి - కృగ్య - పద్మిని- విసర్జిత - విక్షిప్త-పతాక - పతితలనబడే శబ్ద రహితాంగాభినయ తాళాంగ క్రియలు దేశీయతా వైశిష్ట్యాన్ని అసందిగ్ధంగా త్రోసిపుచ్చుతాయి.

మార్గ సంగీతంలో అనేక నామాలకు మార్గశబ్దం ఉపయోగింపబడడంలో ఆశ్చర్యం లేదు. మార్గతాళకళ - మార్గ క్రియ - మార్గభద్ర - మార్గశుద్ధాది శబ్దాలు ప్రయోగించడం సహజమే - కేవల మార్గపరమే అయి 15వ మేళకర్త అయిన "మాయామాళవ గౌళ" రాగ జన్యమైన రాగం ఒకటున్నది.

ఆరోహణం - స, రి, గ, ప, ధ, స

అవరోహణం - స, ధ, మ, ప, గ, రి, స

అని యీ జన్యరాగ ఆరోహణ అవరోహణలు - ఔడవ-వక్ర షాడవ (బ) రాగా నికి చెందిన దీనికి - యిది మార్గ పరమైనదే అయినా మన ప్రాచీనులు "మార్గదేశి రాగం" అని పేరు పెట్టారు. దీనిని బట్టి పరిశీలిస్తే అసలు దేశి అన్నది ప్రత్యేకమైన విశిష్ట వ్యవస్థతో యేదీలేదనీ అది మార్గపరమైన వ్యవస్థలో ఒకానొక భాగమేననీ అవగాహన మవుతుంది-

కాగా మరి రచనాపరంగా ప్రత్యేకించి దేశిరచన అని వర్గీకరణ చెయ్య డానికి వీలులేదన్నమాట - తెలుగులో శివకవుల రచనలు దేశిరచనలన్న భావం

ఉన్నా పెన్నయాదుల కవితారచనలన్నీ దేశికవితారచనలే - సంస్కృతేతర భాషా రచనలన్నిటికీ యీ దేశి కవితారచన, నామాలు వ్యవహృతాలవుతాయి†. అయితే కొందరు భావించినట్లు యక్షగాన రచనా ప్రక్రియ కేవల దేశిరచనే అనడానికి మాత్రం అవకాశం లేదు.

## సంస్కృత యక్షగాన కావ్యాలు

అసలు సంస్కృతంలో తొట్టతొలి యక్షగాన కావ్య మనడానికి సమర్థమైన సుకృతి వాల్మీకి కృతరామాయణం - యక్షగాన కావ్యమంటే యక్షులు గానం చేసినట్లు గానం చెయ్యబడే కావ్యం అని అర్థం. గానం గంధర్వమూలకం - యక్షులకంటే గానంలో అత్యధికులు గంధర్వులుగదా! యక్షగానం కంటే గంధర్వగానం ఉత్కృష్టమైనదనడంలో సందేహం లేదు. గంధర్వగాన ప్రజ్ఞాసమన్వితమై పాడడానికి యోగ్యంగా రచించబడిన రామాయణం యక్షగాన కావ్యంగా భావింపబడడంలో పొరపాటుండదు. వాల్మీకి రామాయణాన్ని గతంలో యక్షగానంగా యెవరూ గుర్తించకపోయినా గానకావ్యంగా కొందరు గుర్తించకపోలేదు. రామాయణం బహుశాస్త్రగ్రంథం - ఆర్ష పద్ధతికి భిన్నంగా సవ్యగ్రంథమై అవతరించిన వ్యాస మహాభారతాన్నే అనేక శాస్త్ర గ్రంథాలకు ప్రతిబింబంగా కాదు - అసలు శాస్త్రసముచ్చయ స్వరూపంగానే ప్రాచీనులు భావింపగా వచ్చి ఆర్ష పద్ధతిలో అపసవ్య గ్రంథమై అవతరించిన వాల్మీకి రామాయణాన్ని లక్ష్యలక్షణమహితమైన బహుశాస్త్రగ్రంథంగా భావించడంలో అనౌచిత్యం యేముంటుంది? వాల్మీకి అసలు తన రామాయణాన్ని షట్ఛాస్త్ర సమ్మతంగానే కాదు - షట్ఛాస్త్ర సమ్మితంగా కూడా రచించాడు. ఈ రహస్యాన్ని యింతవరకూ సరిగా యెవరూ గుర్తించినట్లు కనపడదు. సమ్మితమంటే కూడిందిఅనే యిక్కడ అర్థం. కాగా రామాయణానికి కావ్యపరమైన కథాసంకలితమైన అర్థమేకాక షట్ఛాస్త్రాలపరంగా ఆరు అర్థాలు కూడా వస్తాయన్నమాట. శాస్త్రీయాలైన యీ షడర్థాలూ వ్రాయాలంటే అసలు సరైన వాల్మీకి రామాయణాన్ని పునస్సంస్కారాలతో సంకలనాలతో సంపాదించి ప్రచురించవలసిన ఆవశ్యకత యెంతైనా ఉంటుంది. తర్క-ధర్మ-వైద్య-జ్యోతిష - వ్యాకరణ - గంధర్వవేదార్థాలూ వాల్మీకి రామాయణానికున్నాయి‡. సంగీత పరంగా శాస్త్రీయత ఉన్నట్లు విస్పష్టంగా అర్థమవుతున్నది.

పాఠ్యే గేయేచ మధురం ప్రమాణై స్త్రిభిరన్వితమ్।
జాతిభి స్సప్తభిర్బద్ధంతం|త్రీలయ సమన్వితమ్॥

హాస్య శృంగార కారుణ్యరౌద్ర వీరభయానకైః
భీభత్సాద్భుత సంయుక్తం కావ్యమే తదగాయతామ్॥

---

†మార్గ - దేశి రచనల వ్యవస్థ గురించి "జాను తెనుగు" - "మార్గదేశి కవితలు" - అన్న గ్రంథాలలో కూలంకషంగా యీ రచయిత చర్చించడం జరిగింది.

‡స్థలవిస్తర భీతిచేత మిగిలిన శాస్త్రీయ విషయ నిరూపణం మానివేసి ఒక సంగీతపరమైన (యక్షగాన కావ్య ప్రతిపత్తికై) విషయాలే యిక్కడ ప్రతిపాద్యాలవుతున్నాయి.

తౌతు గాంధర్వతత్వజ్ఞౌ
మూర్ఛనా స్థాన కోవిదౌ
భ్రాతరౌ స్వర సంపన్నౌ
గంధర్వావివరూపిణౌ ॥

అని వాల్మీకి స్వయంగానే పేర్కొన్నాడు. అసలు రామాయణ రచనకే మూలంగా యాదృచ్ఛికంగా అవతరించిన "మానిషాద" ఇత్యాది శ్లోకంకూడా "పాదబద్ధోఽక్షర సమస్తంత్రీలయ సమన్వితః" అని గాన యోగ్యమై అవతరించినట్లే వాల్మీకి స్పష్టపరచాడు. రామాయణమంతా మామూలుగా పఠించడానికి యోగ్యమైనది - అంతేకాదు. మధురంగా పాడడంలో త్రివిధాలైన ప్రమాణాలతోను లయసమన్వితమై స, రి, గ, మ, ప, ధ, ని, స అన్న సప్తజాతులతో బద్ధమై పాడడానికి యోగ్యంగానే రచించబడింది. శబ్ద-అర్థ-రాగ ప్రమాణాలతో—వేద-ధర్మ-పురాణ ప్రమాణాలతో-తర్క-యోగ-వేదాంత ప్రమాణాలతో కూడిఉన్నదట రామాయణం—మరి రామాయణమంతా ఒకే రాగంలో ఒకే తాళంతో ఒకే విధమైన లయతో పాడడానికి వీలుగా రచించబడిందా అంటే కాదని స్పష్టంగా అర్థమవుతున్నది. హాస్యాది వివిధ రసాలతో నిండివున్న యీ కావ్యం గానయోగ్యమంటే ఒకే రాగంలోనని యెలా చెప్పగలం ? ఏ రసఘట్టం వచ్చినా ఒకే రాగంలో గానం చెయ్యాలని సామాన్య సంగీతజ్ఞుడే కాదు - కేవల శ్రోతయైనవాడు కూడా భావించడు గదా ! - రసానుగుణంగా భావానుగుణంగా వివిధ రాగ తాళాలతో గానం చెయ్యాలన్నదే వాల్మీకి భావం - సప్తస్వరాల ఆరోహణఅవరోహణలకు మూర్ఛన అని పేరు- షడ్జ-మధ్యమ-గాంధార గ్రామాలకు మూడింటికి సప్తమూర్ఛనల వంతున లెక్కిస్తే 21 మూర్ఛనలు యేర్పడతాయి. ప్రస్తుత వ్యవహారంలో చతుర్దశ మూర్ఛనలే గాంధ్వర రహితాలై ఉన్నా వాల్మీకి కాలంలోకూడా యివి మాత్రమే వ్యవహృతాలయ్యాయని చెప్పడానికి అవకాశం లేదుగదా ! గాంధర్వ తత్వజ్ఞులు వివిధ మూర్ఛనా స్థానకోవిదులూ అయిన కుశలవులు ఒకే ఒక రాగ తాళలయలతో రామాయణమంతా గానంచేశారని చెప్పలేము గదా ! మహాశాస్త్రజ్ఞుడై త్రికాలజ్ఞుడైన మహర్షి గంధర్వ వేదతత్వజ్ఞుడైన రసజ్ఞ మహర్షి మహాకవి వాల్మీకి ఏకైక రాగతాళ లయబద్ధంగా రామాయణ కావ్యాన్ని రచించి ఉంటాడనడానికి అవకాశం బొత్తిగాలేదు. మనం ముఖ్యంగా గుర్తించవలసింది మరొక విషయం వున్నది- రామాయణం షట్శాస్త్ర సమ్మితం అనుకున్నాము. శాస్త్రీయమైన గ్రంథం యేదైనా కేవల లక్షణబద్ధమై మాత్రమే ఉండదు. లక్ష్యబద్ధంకూడా అయితీరుతుంది. [కొన్ని కొన్ని సందర్భాలలో అర్వాచీనులు పూర్తిగా యీ పద్ధతిని పాటించకపోవచ్చు-] కాగా వాల్మీకి రామాయణం గాంధర్వ (సంగీత) లక్షణ గ్రంథమేకాక లక్ష్యసంబద్ధమైన లక్షణ గ్రంథమన్నమాట-మరి లవకుశులు రామాయణాన్ని యెన్నెన్ని రాగ, లయ, తాళాలతో గానం చేశారో స్వయంగా కర్తయైన వాల్మీకి వారికెన్నిరాగాలు నేర్పాడో చెప్పలేముగదా. అసలు రామాయణాన్ని యక్ష గంధర్వ కిన్నరకింపురుషులే గానంచేశారంటే యెన్నెన్ని రాగాలతో యెంతెంత మధురాతిమధురంగా యెన్ని విధాలుగా గానం చేశారని చెప్పగలం?

కాగా వాల్మీకి రామాయణం కిన్నర గానకావ్యం- కింపురుష గానకావ్యం- గంధర్వ గానకావ్యం-యక్షగానకావ్యం అనడంలో అనౌచిత్యం లేదు. *రామాయణం తరువాత కావ్యాలు వ్రాసినవారు వాల్మీకివంటి మహర్షి మహాకవులూకారు-వాల్మీకివంటి బహుళ శాస్త్రజ్ఞులూకారు- వాల్మీకివంటి బ్రహ్మజ్ఞులూకారు. కాబట్టే వాల్మీకి రామాయణానికి దీటురాగల కావ్యాన్ని- వాల్మీకి మహాకవి పేర్కొన్నట్లు "పాఠ్యే గేయేచ మధురం ప్రమాణైస్త్రిభిరన్వితం- జాతిభిస్సప్తభిర్బద్ధం తంత్రీలయ సమన్వితమ్" కాని కావ్యాన్ని మరొకదాన్ని ఇతరులెవరూ సృష్టించలేకపోయారు. వ్యాస మహాభారతం బహుశాస్త్ర సమ్మతమైనా గాంధర్వ (సంగీత) సమ్మతం-సమ్మితం- గాఅవతరించనే లేదు-ఇతర రచనల గురించి చెప్పేదేముంది ?

లభ్యంకాని అనంతకావ్యవాఙ్మయంలో యక్షగానంగా గాని మరో విధంగాగాని గానం చెయ్యడానికి వీలైన కావ్యాలు యెన్ని అవతరించి మరుగున పడివున్నాయో చెప్పలేముగాని లభ్యమైనవాటిల్లో జయదేవకవి ప్రణీతమైన గీతగోవిందం సంస్కృతంలో అవతరించిన యక్షగాన కావ్యం - సంస్కృత కవి పండితులుగాని విమర్శకులుగాని గీతగోవిందాన్ని యక్షగానంగా పేర్కొనలేదు-వివిధ వృత్త గీతాలతో ఉన్న యీయక్షగాన కావ్యం సర్గలుగా విభజింపబడి ఉన్నా (యక్ష) గానకావ్యంగానే వ్యవహరింపబడుతున్నది- అయితే సంగీతజ్ఞులైనవారు గీతగోవిందంవంటి వాటిని యక్షగాన కావ్యాలుగా వ్యవహరించడం ఉన్నది- తెలుగు యక్షగానాలలో పద్యాలతోపాటు వివిధ కీర్తనలు ధ్రువాలు-ధవళాలు- పదాలు విరచించబడే పద్ధతిలోనే గీతగోవిందం సంస్కృతంలో రచించబడింది.

గీతగోవిందంలో వివిధ శ్లోకాలతోపాటు అక్కడక్కడా మొదట ఒక "ధవళం", పిదప "మంగళం"-అనంతరం "భ్రమరపదం"- రెండు గీతికలు-పదిహేడు ధ్రువాలు రచింపబడ్డాయి- మాత్రాచ్ఛందోబద్ధాలైన యీ ధవళ-భ్రమర- ధ్రువ-గీతికాదులన్నీ తెలుగు యక్షగానాలలోవలెనే వివిధ రాగతాళ యుక్తాలుగా రచియింపబడ్డాయి—ఈ గీతగోవిందం సుప్రసిద్ధమే అయినా యిది సంస్కృతంలో పూర్వమే అవతరించిన-తెలుగు యక్షగాన కావ్యంవంటి యక్షగాన కావ్యమని మనవారు గుర్తించకపోవడం ఆశ్చర్యకరంగానే వున్నది. దీని ప్రణీత జయదేవ కవి క్రీ. శ. 1080–1140 మధ్యకాలంలో ఉన్నట్లు అర్థమవుతున్నది. క్రీ. శ. 11వ శతాబ్దంచివర వంగరాజ్యాన్ని పరిపాలించిన లక్ష్మణసేనుని ఆస్థానంలో యీ జయదేవకవి కొంతకాలం వున్నట్లు కనిపిస్తున్నది— ఉత్కళ దేశీయుడై జగన్నాథ క్షేత్ర సమీప గ్రామీణుడుగా పుట్టి పెరిగిన జయదేవుడు కళింగాంధ్రజాలైన యక్షగాన కావ్యాలవలె సంస్కృతంలో యక్షగాన కావ్యంగా గీతగోవిందాన్ని రచించడంలో వైచిత్రిలేదు. గీతగోవిందం తరువాత సంస్కృతంలో యిటువంటి రచనలు యెన్ని అవతరించి మరుగునపడి ఉన్నాయో చెప్పలేము గాని క్రీ. శ. 1320 ప్రాంతంలో భానుదత్తుడు "గీతగౌరీశ" మన్న మరో యక్షగానకృతిని

---

* "గంధర్వయక్ష విద్యాధరాదులై పాడెదు నాడెదువారు" అని పాల్కురికిసోమన పేర్కొనడంలో ఆంతర్యం యిదే.

గీతగోవింద రచనా ఫక్కీలో - వృత్త- త్రిపదాదులతో (అష్టపదులకు మారు త్రిపదలు) విరచించాడు. తెలుగులోవలె యక్షగానకావ్యాలుగా పేర్కొనబడక పోయినా ప్రాచీన కాలంలో-ప్రస్తుత విమర్శకులు యక్షగాన కావ్యరచనాకాలంగా భావిస్తున్న కాలంకంటె పూర్వకాలంలోనే-సంస్కృతంలోనే గీతగోవిందాది యక్షగాన కావ్యాలు సకృత్తుగానైనా వెలశాయని అర్థమవుతున్నది. గీతగోవిందాది కావ్యాలవలెనే తెలుగులోకూడా త్యాగరాజాదులు రచించగా యక్షగాన ప్రాయాలే అయి అవతరించిన సీతారామ విజయము, నౌకాచరిత్ర, ప్రహ్లాదభక్తి విజయము మొదలైనవి యక్షగానాలుగా పేర్కొన బడలేదు. అందువల్ల గీతగోవిందాది కృతులు యక్షగానాలుగా వక్కాణింపబడకపోయినంతమాత్రాన యక్షగాన కావ్యాలు కాకపోవు-

## తెలుగు యక్షగానాలు

మాత్రాబద్ధాలు గణ సమకబద్ధాలు అయిన వివిధ చ్ఛందస్సుల్లో వ్రాయబడిన రచనలతో యక్షగానం తొలుత తెలుగులోకూడా కావ్యంగానే రచించబడుతూ ఉండేది. పాల్కురికి సోమన మాటల్నిబట్టి చూస్తే క్రీ. శ. 1000 ప్రాంతం నుంచో అంతకుపూర్వంనుంచో యక్షగాన కావ్యరచన తెలుగులో జరుగుతూవుండేదని చెప్పవచ్చు. "అయితే ఆ కాలపు యక్షగాన రచనలేమైవుంటాయి'' అన్న ప్రశ్న రావచ్చును. నన్నయభట్టు-తిక్కనల నడిమికాలంలో శైవేతరమైన వాఙ్మయం తెలుగులో అసలు రచించబడనేలేదని చెప్పలేముగదా! ఈ రెండువందల సంవత్సరాల కాలప్రవాహంలో యెన్నిరచన లవతరించినా నామరూపాలు లేకుండానే గతించిపోయాయన్నమాట. ఈ శైవేతర వాఙ్మయంవలెనే తొలి తెలుగుయక్షగాన రచనలుకూడా కాలగర్భంలో కలిసిపోయాయన్నమాట. గీత గోవిందాదులు ఏకవ్యక్తి పాత్రతా పరిమితాలే అయినా నృత్యగానాలతో-కాళ్లకు గజ్జెలు కట్టుకొని చేతిలో చిరుచిరతలు ఉంచుకుని వివిధ వాద్యసహాయాలతో గీతగోవిందాదులు గానం చెయ్యబడుతూవుండేవి సంస్కృత కావ్యాలుకాబట్టి తెలుగులో తాత్పర్య వివరణం చెయ్యబడుతూవుండేవి. ప్రత్యేకించి తెలుగు తాత్పర్య వివరణతో పనిలేకుండా తెలుగు యక్షగాన కావ్యాలు గానం చెయ్యబడేవి. ఇవి తొలుత కావ్యరూపంలోనే ఉన్నా తరువాత నాటకరూపం- ప్రదర్శన యోగ్యమైన రూపక రూపం పాల్కురికి సోమనకు పూర్వమే దాల్చి ప్రసిద్ధివహించినట్లు తెలుస్తున్నది. ప్రచ్ఛన్న వేషములుదాల్చి (గంధర్వ యక్ష విద్యాధరాదులై పాడెడు నాడెడువారి విధమున) పాడి ఆడేవారని సోమన పేర్కొన్నాడు. అసలు యక్షగానాలగురించి విమర్శలు వ్రాసినవారంతా పండితారాధ్య చరిత్రలోని- "ఆదట గంధర్వ...... దులుకాదునట్లు'' అన్న పాదాలవరకే గ్రహించారుగాని సోమన పేర్కొనదలచిన విషయంకాని వాక్యాలుగాని ఆ పాదాలతో ముగియనేలేదు- గంధర్వాదుల వలె వేషాలు ధరించి పాడి ఆడేవారివిధంగా ప్రచ్ఛన్నవేషాలు దాల్చి అధికోత్సావందులు కాడేట్లు వారేంచేశేవారో ఆ తరువాతి పాదసముచ్చయంలో తెలియపేశాడు సోమన-అంతకు పూర్వమే నాటకప్రదర్శనలు చేసేవారున్నారనికూడా పేర్కొన్నాడు సోమన-

ప్రమథ పురాతన పటు చరిత్రములు
క్రమమొంద బహు నాటకములాడువారు

అని స్పష్టంగా పేర్కొన్నాడు-అంతేకాదు వాటి నృత్యనాటకాదులకు తెరలుండే వని ఆ తెరలనుంచి పాత్రధారులు-వేషధారులు వెలుపలికివచ్చి అభినయించేవారని కూడా సోమన తేటతెల్లం చేశాడు. ''శిరమున నురమున'' మొదలు ''పుష్పమాలికల్ దాల్చి'' వరకును తదుపరి మరికొన్నిచోట్లా వేషాలను వర్ణించాడు.

అనుకూల వివిధ వాద్య సమ్మేళనమునఁ
నార్భటంబిచ్చి యొయ్యన జవనికల
గర్భంబు వెడలి యక్కజము వట్రిల్ల
నాటకమందఱ నభినయంబొలయ

తెరమరుగునుంచి వెలువడి ఆడేవారట.

వెండియు భవు బహువిధ చరిత్రముల
ఖండితగతి నాటకంబులాడుచును

అని మరోసారికూడా నాటకాలాడుతున్న విషయం పేర్కొన్నాడు. ఈ జవనికలు నాటకాలు కేవల నాటకాలకు సంబంధించినవికావని తోలుబొమ్మలాటలకు సంబంధించినవని యెవరైనాభావిస్తారేమో అది సరికాదు.

భారతాది కథలఁజీరల మఱుఁగుల
నారంగ బొమ్మలనాడించువారు

అని తోలుబొమ్మలాటల్ని సోమన ప్రత్యేకంగా వర్ణించాడు. శివరాత్రి ఉత్సవాలలో నిర్వహించే కళాసంభరిత వినోద విజ్ఞాన కార్యక్రమాలను సోమన పెక్కు ద్విపదలలో యిరవై పుటలలో వర్ణించాడు. యీ యిరవై పుటల్లోనూ తాళపత్ర ప్రతుల్లో తప్పులు కుప్పలుగా ఉండడం-వివిధ పాఠాంతరాలుండడంకూడా సంభవించింది. వివిధ వేష భాషలతో ఉండే రకరకాల పాత్రదారులను

కరముబ్బుచును జొల్లు కారిచికొనుచు
సరసంబులాడుచు చప్పట విడుచు

నంటూ హాస్యగాళ్లతో సహా అందరినీ వర్ణించాడు. ఎన్నెన్ని విధాలైన అభినయాదులు వాద్యాలు యీ ప్రదర్శనల్లో ఉండేవో చాలా వివరంగా వర్ణించాడు. తప్పులతడకలై వున్న యీ పాఠాలలో అసలు ''యక్షగాన'' శబ్దం కూడా ప్రయుక్తమై మరుగున పడిపోయిందా అని సందేహం కల్గుతున్నది- పండితారాధ్య చరిత్ర సరైన మూలప్రతుల్ని పరిశోధిస్తేనేతప్ప యీ విషయం బైటపడదు- ఏది యేమైనా తెలుగు యక్షగాన కావ్యాలు నాటకాలు అత్యంత ప్రాచీనకాలంలోనే రచియించబడినాయని విస్పష్టంగానే చెప్పవచ్చు- శ్రీ రాఘవన్‌గారన్నట్లు

సంస్కృత ఉపరూపకాలు మూలంగా ఆదర్శంగా యీ యక్షగాన నాటకాలు తెలుగులో రచింపబడ్డాయనడంలో సందేహం లేదు- సంస్కృత ఉపరూపకాలు గేయ-నృత్య రూపకాలుగా ప్రాచీనకాలంలో రచింపబడేవి- అందువల్లనే కావ్యాను శాసన భావ ప్రకాశకారులు ఉపరూపకాలను గేయరూపకాలనీ నృత్య ప్రకారము లనీ పేర్కొన్నారు. కొందరు ఆ కాలంలో వీటిని గేయ రూపకాలనీ నృత్య ప్రకారాలనీ వ్యవహరించేవారు. అందువల్ల ప్రత్యేక లక్షణప్రమేయం లేకుండా కేవల ఆదర్శప్రాయమైన అనుకరణలతో గేయ నృత్య ఉపరూపకాలు ఆధారంగా తెలుగులో యక్షగాననాటకాలు క్రమంగా అవతరించాయని భావించవచ్చు-కాగా యక్షగానం రచన సంస్కృతంలో లేని వినూతన దేశిరచనాప్రక్రియగా మనం భావించ నక్కరలేదు.

## సీ తా క ల్యా ణ ము

అలభ్యమై అంతరించిపోయిన సాహిత్యం పోగా క్రీ. శ. 15వ శతాబ్దం నుంచి మనకు కొన్ని కొన్ని యక్షగాన రచనలు లభించాయి. లభ్యమైన యక్షగానాలను దృష్టిలో పెట్టుకుని అనేక మంది గతంలో పెక్కు విమర్శనా వ్యాసాలు వ్రాశారు. ఆ యా విశేషాలన్నీ సంగ్రహంగా డాక్టర్ దివాకర్ల వేంకటావధాని గారు యీ గ్రంథ ఉపోద్ఘాతంలో వివరించారు. ప్రస్తుత రచన క్రీ. శ. 1684 ప్రాంతంనుంచి దాదాపు ముప్పై సంవత్సరాలు తంజావూరు రాజ్యాన్ని పరిపాలించిన మహారాష్ట్ర రాజైన శహాజీ కృతమైన సీతాకల్యాణ యక్షగాన నాటకం- శహాజీ ఆస్థానంలో అనేకమంది సంస్కృతాంధ్రాది కవిపండితులుండేవారు. మహాభక్తుడయి అజరామరాలైన పెక్కుకృతులు రచించి కీర్తివహించిన శ్రీత్యాగరాజుకు తాతగారైన శ్రీ గిరిరాజకవికూడా యీ శహాజీ ప్రభువు ఆస్థాన కవియే. ప్రత్యేకించి శ్రీ గిరిరాజ కవికి "యక్షగాన రచయిత" అన్న బిరుదు కూడా ఉండేది. చెప్పుకోదగినన్ని విశిష్టతగల యక్షగానాలు శ్రీ గిరిరాజకవి రచించాడు. శహాజీ పెక్కురచనలను తాను అంకితంగా స్వీకరించడమేకా తనకు తానై పెక్కు రచనలు చేశాడు. శహాజీ రచనల్లో యక్షగాన ప్రబంధాలూ ఉన్నాయి. యక్షగాన నాటకాలూ ఉన్నాయి. శహాజీ తెలుగు నేర్చుకుని మరీ తెలుగులో రచన చేసిన వ్యక్తి. సంస్కృతం ఒక్క తెలుగు వారి సొత్తుకాదు. శహాజీ మహారాష్ట్రుడుగానే సంస్కృతం నేర్చుకొని వుండవచ్చు- ఏ రాష్ట్రీయుడైనా యేభాషీయుడైనా సంస్కృతం నేర్చుకొనవచ్చునుగదా ! ప్రత్యేకించి తెలుగు నేర్చుకుని కవిత వ్రాయాలన్నంత కాంక్ష, భక్తి, శ్రద్ధ, ఓపికా శహాజీ కున్నప్పుడు అటువంటి కాంక్షాదులు సంస్కృతాభ్యసన రచనాదులపట్ల ఉండవని ప్రత్యేకించి చెప్పడానికి తగు కారణాలు కనిపించవు. కాగా కథాప్రారంభంవరకూ ఉన్న తొలి రచనాభాగంలోని సంస్కృత శ్లోకాలను గీతాలను శహాజీయే మిగిలిన కృతి వలెనే రచించాడని భావించవచ్చు- ఏమైనా అల్లరి చిల్లరి బజారు భాగవతపు గేయ రచనగా కాక ఒకానొక ప్రత్యేక వైశిష్ట్యంతో రచియించబడిన యీ యక్షగాన నాటక విశేషాలను కొన్నిటిని డాక్టర్ వేంకటావధానిగారు ఉపోద్ఘాతంలో వివరించారు. మరికొన్ని విశేషాలిక్కడ ప్రస్తావించడం జరుగుతున్నది.

## జనకుడు చంద్రవంశజుడా ?

ప్రాణి సృష్టి యెప్పుడు ప్రారంభమైనదో అప్పుడె అతిచారం ప్రారంభమైనది. ఎప్పుడెక్కడ యేవిధంగా అతిచారం జరిగిందో యెవరూ చెప్పలేని యీ సంఘంలో వర్ణాశ్రమ ధర్మాలకు తొలుత స్థానమే లేదు. వాటిని కొందరు స్వార్థపరులు కృతకంగా సృష్టించారు. అయినా వాటికి సంబంధించిన - వర్ణ - వంశాది ప్రసక్తులు మన ప్రాచీన రచనల్లో ప్రాధాన్యం వహించాయి. కాబట్టి యిక్కడ ఒక ప్రత్యేక విషయం విమర్శకుల దృష్టికి తెస్తున్నాను.

దశరథుడు రామాయణం ప్రకారం పురాణాల ప్రకారం ఇక్ష్వాకు వంశజుడైన సూర్యవంశపురాజు. సీతను పెంచి పెద్దచేసి శ్రీరామచంద్రునికిచ్చి వివాహం చేసిన జనక మహారాజుకూడా ఇక్ష్వాకు వంశజుడైన సూర్యవంశపు రాజుగానే పురాణాలు పేర్కొన్నాయి. జనక మహారాజు తాతముత్తాతల క్రమం యిది. సూర్యవంశంలో

| | | | |
|---|---|---|---|
| 1. ఇక్ష్వాకుడు | 8. బృహద్రథుడు | 15. కృతరయుడు | 22. హ్రస్వరోముడు |
| 2. నిమి | 9. మహావీర్యుడు | 16. దేవమీఢుడు | 23. సీరధ్వజుడు. |
| 3. జనకుడు | 10. సుధృతి | 17. విధృతుడు | (జనకుడు) |
| 4. ఉదావసుడు | 11. ధృష్టకేతుడు | 18. మహాధృతి | |
| 5. నందివర్ధనుడు | 12. హర్యశ్వుడు | 19. కీర్తిరాతుడు | |
| 6. సుకేతుడు | 13. మరువు | 20. మహారోముడు | |
| 7. దేవరాతుడు | 14. ప్రతింధకుడు | 21. స్వర్ణరోముడు | |

ఈ పై వరుస సంఖ్యా నామాలున్న వారంతా క్రమంగా మొదటివారికి తరువాతి వారు పుత్రులు.

పురాణాలలో సూర్యవంశజుడుగానే భావింపబడిన జనక మహారాజు చంద్రవంశపు రాజుగా యీ సీతాకల్యాణంలో ఒకటికి రెండుసార్లు పేర్కొనబడ్డాడు.

లలితుడౌ దశరథరాజుకు చంద్ర
కులజుండు సకల సద్గుణ సమన్వితుడు
పలుమార్లు జనక భూపాలుండు మొక్కి (21 పుట)

అని దశరథునికి జనకుడు పంపిన లేఖలో ఉల్లేఖించబడింది- అనంతరం దశరథుడు బంధుమిత్ర పరివారంతో మిధిలాపురికి వచ్చిన తరువాత జనకమహారాజుతో సంభాషిస్తూ

జనక మహీపాల వినుము నీవు
చంద్ర వంశ రాజేంద్రుడవు (22 పుట)

అని తిరిగి చంద్రవంశజుడుగా పేర్కొంటాడు. జనకుడు చంద్రవంశజుడనడం అమూలకమే అయినా శహాజీ ప్రత్యేకించి యీ విధంగా పేర్కొనడానికి తగిన కారణమేమో పరిశీలించవలసివున్నది.

పొరపాటో కాదో చెప్పలేముగాని మరొక విచిత్రం యీ రచనలో కనిపిస్తున్నది- కటికవాడు (20 పుట) ప్రవేశించి దశరథునితో "స్వామీ! మిథిలాపురి నుంచి మంత్రి వచ్చియున్నాడు-" అని అంటాడు. వెంటనే దశరథుడు "ఈ వేళ ఎక్కడి మంత్రి పొమ్మనర" అంటాడు-కాని ఆవెంటనే వశిష్ఠుడు "పిలిపించవయ్యా!" అనడం మంత్రి ప్రవేశించి కమ్మ యివ్వడం జరుగుతుంది. దశరథుడు "యిప్పుడేమిటి పొమ్మంటే వశిష్ఠుడు తద్భిన్నంగా ప్రవేశపెట్టమనడం అతని మాట ప్రకారం తరువాత కార్యక్రమం కొనసాగడం విడ్డూరంగానే ఉంటుంది. అసలు మరొక మహారాజు వద్దనుంచి మంత్రివస్తే "ఇది అవేళ పొమ్మనడం" సమంజసమేనా-ఆ విధంగా అసలు దశరథుడంటాడా అనికూడా యెవరికైనా సందేహం కలుగుతుంది- వశిష్ఠుల వాక్కులను మహారాజులు శిరసావహిస్తారని మహారాజుల మాటలకు భిన్నంగా వశిష్ఠులు సర్వాధికారులుగా వారి సమక్షంలోనే ఆజ్ఞాపించగలరని తెలియజెప్పడానికి శహాజీ యీ సందర్భాన్ని యీ విధంగా ఉపయోగించాడా అని కూడా అనిపిస్తున్నది.

ఈ రచనలో ఉపయోగించబడిన భాష సరళ గ్రాంధికంగానే ఉన్నది. అయితే మధ్యమధ్య వచనాలలో మాత్రం కొంత వ్యావహారిక ప్రభావం గోచరిస్తున్నది. అదికూడా కేవల వ్యావహారికంకాక తత్ప్రభావంతో కొన్ని కొన్ని వికృతులు పొందిన పదాలు మాత్రమే ఉపయోగితాలయ్యాయి.

మధ్యమధ్య సూత్రధార వచనాలతో పాటు శ్లోకాలుకాక ఒక జయగీతి- ఒక శరణుగీతి-ప్రారంభంలోనూ-నాటకం ముగింపులోనూ ఒక్కొక్క మంగళగీతి-ఒక గద్యకైవారం—ముప్పైమూడు దరువులు-ద్విపద-కంద సీసాది పద్యాలు ఉపయోగింపబడ్డాయి-జయగీతి-శరణగీతి-మంగళగీతాలకు రాగతాళాలు మూలప్రతిలోనే యీయబడ్డాయి-33 దరువుల్లో పది దరువులకు రాగాలు [అరిగెలు కత్తులును-(9పు),-సొగసైన-తేజనుమీర-(10పు), నిడుదజడల-(12పు), ఎందుకే ప్రతిజ్ఞ-బాలనిచ్చెద- (15పు), విల్లెక్కుపెట్టుము- (16పు)- మునిచంద్ర-(19పు)-" ఒక్క దరువుకు రాగతాళాలు రెండూను [వందేయీశ్వర-6పుట] మరోదరువుకు కేవలం ఒక్కతాళం [సతత నీతి పరుండు-7పుట] మాత్రమే మూలప్రతిలో యివ్వడం జరిగింది. అయితే మొత్తందరువులన్నింటికీ కూడా యీ గ్రంథంలో రాగతాళాలు పరిశీలించి నేను సమకూర్చడం జరిగింది.

## దరువు

వీధినాటకాల్లోనూ యక్షగానాల్లోనూ దరువు అన్నది ఒక వాచ్యంగా భావించడం జరుగుతున్నది-దరువుకు దరు అని రూపాంతరం కూడా ఉన్నది. ఒక విధమైన తాళానికి—ఒక విధమైన వాద్యానికి—ఒక వరుసలో నడచే వాదనానికి (వాద్యాన్ని వరుసలతో మోగునట్లు కొట్టడం—వాయించడం) దరువు అని పేరు.

కథానాటికలకు—నృత్యనాటికలకు సంబంధించిన సంగీత రచనకు అంటే పాడడానికి సిద్ధమైన గీతానికికూడా "దరువు" అని పేరు ఉన్నది—కాబట్టే యీ యక్ష గానంలో దీని రచయిత పెక్కు గీతాలకు దరువులనే పేరు పెట్టాడు. దరువుల్లో సామాన్యంగా పల్లవి—అనుపల్లవి—చరణాలుంటాయి—నాటకంలో కథాగమనం చురుకుగా సాగుతున్నపుడు పల్లవి—అనుపల్లవులు లేకుండా సైతం దరువులు—కేవల చరణాలతో మాత్రమే రచియించడం కూడా వున్నది—కొన్ని దరువులకు సాహిత్యం జతులలోకూడి వుంటుంది — (1) పాత్ర ప్రవేశ దరువు (2) స్వాగత దరువు (3) వర్ణన దరువు (4) కోలాట దరువు (5) సంవాద దరువు (6) ఉత్తర ప్రత్యుత్తర దరువు అని యీ దరువు ఆరు సందర్భాలలో ఆరు విధాలుగా ఉపయోగ పడుతుందని ప్రాచీనులు భావించారు. ఈ సీతాకల్యాణంలో ఒక్క కోలాట దరువు తప్ప మిగిలినవన్నీ ఉపయోగింపబడ్డాయి.

## గద్య కైవారం

అసలు సీసపద్యం శీర్షకమన్న తాళగీతికా మాత్రాచ్ఛందంపై ఆధారపడి వచ్చి ఉంటుందని లోగడ పరిశోధనల్లో ఊహించబడింది—అత్యంత ప్రాచీన కాలంలో తెలుగులో సీసం పాటగానే వీరశైవ వాఙ్మయంలో ఉపయోగింపబడేది.

దక్షుడు యజ్ఞంబు హాళ్మరభ శరభ
తలపెట్టినంతలో హాళ్మరభ శరభ
బ్రహ్మదేవుని గుండె హాళ్మరభ శరభ—
ఢగ్గుమనియె హాళ్మరభ శరభ—

ఇత్యాదిగా వీరశైవులు వీరభద్రపళ్లెం పట్టి ఆనకట్టు విడుపుల సందర్భాల్లో పాడుతూ వుండేవారు. ఇది కూడా ఒక విధమైన దరువే. పై పంక్తులలో "హాళ్మరభ శరభ" అన్న దరువు పదాలను తొలగిస్తే అక్షరాలా అది సీస పద్యపాదంగా రూపొందుతుంది.

దక్షుడు యజ్ఞంబు తలపెట్టినంతలో
బ్రహ్మదేవుని గుండె ఢగ్గుమనియె †

శైవ వాఙ్మయంలో యెన్నెన్నో విధాలైన గద్యలుపయోగింపబడేవి—ఆ గద్యలన్నీ యేదో ఒక మాత్రాచ్ఛందస్సుతో పొత్తు కుదుర్చుకునేవే—అయితే ప్రస్తుత సీతాకల్యాణంలో గద్య కైవారంగా రచియించి సమకూర్చిన కైవారం (4 పుట) అసలు గద్యకానేకాదు. అక్షరాలా సీసపద్యపాదాలే—చివరిపాదంలో—పూర్వోత్తరార్థాల్లో రెండిటా రెండక్షరాలెక్కువైనట్లు కన్పిస్తున్నదిగాని "ఏక మహీతలేశ తనూజ" "భోస్లే శహరాజ" అని కర్త వ్రాశాడా అనిపిస్తుంది—అంతకు పూర్వం వున్న అయిదు పాదాల్లోనూ అక్షరమైనా మార్పు చెయ్యవలసిన

---

† చూ. డాక్టర్ గిడుగు వెంకటసీతాపతిగారి రచన "తెలుగులో ఛందోరీతులు" కు నేనువ్రాసిన "గ్రంథ పరిచయము" పుటలు-18, 19.

అవసరం లేకుండా యతిగణాలతో సీస లక్షణం సరిపోతుంది. మార్గచ్ఛందస్సులో లయతాళ యుక్తాలై పాడడానికి వీలుగా విద్యున్మాల — భుజంగ ప్రయాతాది వృత్తాలున్నట్లే దేశీయాలనుకునే పద్యాలు సైతం వివిధ పద్ధతుల్లో పాడడానికి వీలయ్యేట్లుగానే రూపొందాయన్న మాట.

## సూత్రధారుడు

యక్షగాన నాటకాల్లో సూత్రధారుడు ప్రధానపాత్ర వహిస్తాడు. సూత్రధార శబ్దం గురించి గతంలో చాలామంది విమర్శకులు చర్చించి అది "తోలు బొమ్మలాటలవల్ల" యేర్పడిన పదమన్న అభిప్రాయం వెల్లడించారు. తెల్లని గుడ్డ తెరకట్టి ఆ తెరకు రంగు రంగులుగా తీర్చిదిద్దిన తోలు బొమ్మలను పెట్టి వాటి చేతులు కాళ్లు మొదలైన వాటికి సూత్రం కట్టి ఆ సూత్రాన్ని పట్టుకుని అభినయం ఆ బొమ్మలతో చేయిస్తూ పాటలు పద్యాలు పాడుతూ మాట్లాడుతూ తోలు బొమ్మలాట ఆడతారు. తోలుబొమ్మలాట ఆడడానికి "సూత్రం పట్టుకుని" ఆ పని చెయ్యాలి కాబట్టి ప్రయోక్తకు సూత్రధారుడన్న పేరు వచ్చివుంటుందనీ యిదే నాటకాలలో సూత్రధార పాత్రకు స్థానం కల్పించిందనీ విమర్శకుల భావం.

అసలు నాటకాల్లో సూత్రధారుడొక్కడే ఉంటాడు. అతనే ప్రయోక్త. అభినయాదుల్లో నటీనటులందరికీ సరైన శిక్షణ యిచ్చి కార్యక్రమం సక్రమంగా విజయవంతమవ్వడానికి అతనే పరిశ్రమిస్తాడు. సూత్రధారుడంటే నేటి సినిమా డైరక్టర్ వంటి వాడన్నమాట. నాటకంలో యెన్ని పాత్రలుంటాయో అంతమంది సూత్రధారులుండరుకదా ! అయితే తోలుబొమ్మలాటల్లోకూడా అసలు సూత్రధారుడు అంటేడైరక్టర్ వంటివాడు ఒకే ఒక్క వ్యక్తి ఉన్నా ప్రతి పాత్రకూ ఒక్కొక్క సూత్రధారుడో—చేతులు మారినా—అక్కడా యిక్కడా సర్దుకున్నా మొత్తంమీద యిద్దరు ముగ్గురికంటే యెక్కువమంది సూత్రధారులో ఉండకతప్పదు. (ఒక్కొక్కసారి ఒక వ్యక్తే ఒక బొమ్మను విడచి మరో బొమ్మకు సూత్రధారిత్వంవహించడం జరుగుతుంది). అందువల్ల తోలుబొమ్మలాటలో ఆడించేవారెందరుంటే అందరూ—అంటే యెంత ప్రధానపాత్రధారులైనా—యెంత అప్రధాన పాత్రధారులైనా సరే సూత్రధారులేనన్నమాట—అందువల్ల ఒకే ఒక్కడుగా వెలుగొందే నాటక సూత్రధారిత్వానికి మూలం తోలుబొమ్మలాటల సూత్రధారిత్వమనడం అంత సమంజసంకాదేమోననిపిస్తున్నది. అంతేకాదు- నాటకాలన్నవి యెంత ప్రాచీన కాలంనుంచీ వున్నాయో అంతకు పూర్వంనుంచి—అంటే—భరతాదులకు పూర్వం నుంచీ కూడా తోలుబొమ్మలాటలున్నాయని మనం నిరూపించవలసి వుంటుంది. యింతటి సత్కార్యం యిప్పటికెవరూ చెయ్యలేదు. చెయ్యడం సాధ్యం కాదేమో కూడా. ఇంతగా యెందుకు వ్రాస్తున్నానంటే అసలు "సూత్రధార" శబ్దం రూపొందిన తీరు చెప్పే విషయంలో విమర్శకులు పొరపడ్డారేమోనని—

సూత్రమంటే దారం—బాగానే ఉన్నది—"సూత్రధారి" అంటే సూత్రాన్ని ధరించే వాడు అని అర్థంకాక "సూత్రంవలె (సూత్రమివ) ధరించేవాడు" అని అర్థం చెప్పాలి. రత్నాలు లేదా ముత్యాల మాల ఉంటుంది—అన్నీ విడి విడి

పూసలే—అయితే వాటన్నిటినీ వరుసగా కూర్చి అమర్చడంలో ఉపయోగపడేది అంతర్గతంగా ఉండే సూత్రం—సూత్రం యే విధంగా అంతర్గతమైఉండి ముత్యాలు మొదలైన వాటినన్నిటినీ ఒక పద్ధతిలో క్రమంలో ఉండడానికి తగు అవకాశం కల్పిస్తుందో అదేవిధంగా నాటకంలోని పాత్రధారులంతా సక్రమంగా ఉండి ఒక శోభను అన్నివిధాలా సమకూర్చడంలో అంతర్గతంగా ఉండి కృషిచేసేవాడు కాబట్టి "సూత్రధారి" (సూత్రమివధరతి — ఇతి సూత్రధారి- సూత్రధారః) అయి వుంటుందేమోననిపిస్తున్నది. మాలకు అంతర్గతంగా ఉండే సూత్రం ఒక్కటే ఉంటుంది. కాబట్టి నాటకానికి కూడా సూత్రధారుడొక్కడే ఉంటాడు. అదే సమంజసం కూడా—మరి యక్షగాన నాటకాల్లోకూడా సూత్రధారుడొక్కడేవుండడం, అతడే కథను నడిపించే ప్రధాన వ్యక్తి కావడం ప్రత్యక్షంగా కనిపిస్తూనేఉన్నది.

అసలు సూత్రశబ్దం ఆర్షేయం—అన్ని రంగాలలోను అంటే అన్ని శాస్త్రాల లోనూ ఆర్షవిజ్ఞానం మృగ్యంగా తయారైనట్లే ఆర్షవిజ్ఞాన సాంకేతిక పదజాలం కూడా అర్థజ్ఞానానికి దూరమైపోయింది. ఆర్ష దృష్టితో చూస్తే అసలు అంతర్గత మైన విశేషార్థం కలదే పరిగర్భితమైన గూఢార్థంకలదే సూత్రం—ఆర్ష శాస్త్రగత సూత్ర సముచ్చయమంతా యిటువంటిదే. దీనికి సంబంధించిన పరిశోధనాంశాలన్నీ యిప్పుడు వివరించడానికి స్థలంలేదు కాని "సూత్ర" శబ్దం కేవలం తోలుబొమ్మ లాటలపై ఆధారపడి వచ్చివుంటుందన్నది అతి సామాన్యమైన ఊహ మాత్రమే నని తెల్పడానికే యీ నాలుగుమాటలూ వ్రాశాను.

ప్రస్తుత సీతాకల్యాణంలో నాటకం ప్రారంభమైన తరువాత మధ్య మధ్యలో వచ్చే సూత్రధారవచనాలకు బ్రాకెట్లు పెట్టడం జరిగింది. నాటకంలో పాత్ర ప్రవేశ పరిచయాదులు చెయ్యడం తప్ప సూత్రధారునికి ప్రత్యేకతలేదు. నాటకంలో అతడొక పాత్ర కానేకాడు. అందువల్ల బ్రాకెట్లు ఉంచడంజరిగింది. యక్షగాన నాటక ప్రదర్శనలో సూత్రధారునితోపాటు కొందరు వాద్యగాళ్లు వంత దార్లు వుంటారు. వచనం చెప్పేటప్పుడు సూత్రధారుడొక్కడే చెప్తాడు. పద్యం వచ్చినా సూత్రధారుడొక్కడే చదువుతాడు. కొన్ని సందర్భాలలో ఎవడో ఒక వంతగాడు "సూత్రధారుడు పద్యంలో ఒక పంక్తి చదివినతరువాత" ఆ పంక్తి మొత్తాన్నిగాని దానిలో కొంత భాగాన్నిగాని పునరుచ్చరించడం కద్దు—దరువులు పాటలు పాడడం సూత్రధారుడే ప్రారంభించినా బృందం అంతా సామాన్యంగా వంతలతోపాడతారు. చరణాలు కేవలం సూత్రధారుడే పాడడం, ఆ చరణం చివరినుంచి పల్లవిని వంతదారులందుకోనడం జరుగుతుంది. తొలుత ప్రార్థనాది కాలు సూత్రధార బృందం నెరవేర్చగా చివరికి మంగళం సూత్రధారుడు, తద్బృందం, తదితర పాత్రధారులంతా కలిసి గానంచేస్తారు. మామూలుగా సూత్రధారుణ్ని అతని వచనాలను పద్యాలను తొలగిస్తే మిగిలిన భాగం అంతా ఒక చక్కని పద్యగేయ నాటికగా రూపొందుతుంది. విపులమైన యీ తొలి పలుకు ముఖంగా—గతంలో యక్షవాఙ్మయ చరిత్రలో పరిశోధనావిమర్శలు సాగించిన వారెవరూ గుర్తించని విషయాలు—తెలియజెప్పని విషయాలు — సమన్వయ పరచి ఏక వాక్యతకు తీసుకురాని విషయ రహస్యాలు పెక్కులు పరిశోధనాత్మ కంగా వెల్లడించాను. దాదాపు అన్నీ వినూత్న విషయాలే. ఈ తొలిపలుకుతో

యక్ష వాఙ్మయచరిత్ర ఒక కొత్తరూపు దాల్చించని నిస్సందేహంగా చెప్పవచ్చు. సత్యాన్వేషణాపరమైన యీ మార్గాల్లో పరిశ్రమించి యింకా యింకా యక్షగాన చరిత్రాంశాలను పరిశోధకులు వెల్లడించాలని కోరుతున్నాను.

ఆంధ్రప్రదేశ ప్రభుత్వం తన విద్యాశాఖకు చెందిన రాష్ట్ర ఆర్కైవ్స్ డిపార్టు మెంటులో ఉన్న ఆంధ్రప్రదేశ గవర్నమెంటు ఓరియంటల్ మానిస్క్రిప్ట్సు లైబ్రరీ అండ్ రిసర్చి ఇనిస్టిట్యూట్ ద్వారా అమూల్యాలైన ప్రాచీన అముద్రిత గ్రంథాలను— వివిధ కావ్య పురాణశాస్త్ర గ్రంథాలను పరిశుద్ధంగా ప్రచురించాలని సంకల్పించింది. ఈ సత్సంకల్ప ఫలితంగానే యీ సీతాకల్యాణ యక్షగాన నాటకం ప్రచురింపబడు తున్నందుకు సంతోషిస్తున్నాము.

ఇట్లు
వాఙ్మయ మహాధ్యక్ష
వడ్లమూడి గోపాలకృష్ణయ్య
కళా-ప్రపూర్ణ
Joint Director,
Andhra Pradesh Government
Oriental Manuscripts Library
and Research Institute,
Afzalgunj.

Hyderabad
29-11-1971

# ఉ పో ద్ఘా త ము

సీతాకల్యాణ మను నీ యక్షగానమును రచించినవాఁడు తంజావూరు రాజ్యమును బరిపాలించిన మహారాష్ట్ర ప్రభువులలో నొకఁడగు శహాజీ. భోసల వంశసంజాతుఁడగు నితఁడు ఛత్రపతిశివాజీ సవతితమ్ముఁడగు ఏకోజీకి దీపాంబిక యందు జన్మించెను. తంజావూరు రాజ్యము నాయకరాజుల యనంతరము మహారాష్ట్రుల పశమయ్యెను. ఈ మహారాష్ట్ర ప్రభువులుకూడ నాయకరాజులవలెనే యాంధ్ర భాషావాఙ్మయముల నాదరించి పోషించుటయేకాక తాము ను ఆ భాష నేర్చుకొని యందు స్వయముగాఁ గొన్ని రచనలు కావించిరి. వారు కావించిన రచనలు పెక్కు యక్షగానములే. క్రీ. శ. 1684 నుండి 1712 వఱకును తంజావూరు రాజ్యమును పరిపాలించిన శహాజీ పెక్కు యక్షగానములను దానంకితముగా గ్రహించుటయేకాక స్వయముగా నిరువదిరెండు యక్షగానములను రచించి యుండెను. అందు రెండతని పేర నున్నను అతఁడు రచించినవి కావని విమర్శకులు తలంచుచున్నారు. మిగిలిన యిరువదింటిని రచించునప్పుడుకూడ నతఁడు తన యాస్థానకవుల సాహాయ్యమును గ్రహించియుండును. ఇతని యక్షగానములందలి కృత్యవతారికా శ్లోకాదులా యాస్థానకవులరచనలనుండి గ్రహించినట్లు కనఁబడును. లేదా ప్రతి లేఖకులు తదాస్థాన కవి రచితములైన శ్లోకములను బ్రతులను వ్రాయునప్పు డందందుఁ జొప్పించి యుందురనియు నూహింప వచ్చును.

1. విఘ్నేశ్వరకల్యాణము 2. శచీపురందరము 3. వల్లీకల్యాణము 4. శాంతాకల్యాణము 5. ద్రౌపదీకల్యాణము 6. కృష్ణలీలావిలాసము 7. జలక్రీడలు 8. సతీపతిదానవిలాసము 9. సీతాకల్యాణము 10. రామపట్టాభిషేకము 11. రతికల్యాణము 12. రుక్మిణీసత్యభామా సంవాదము 13. కిరాత విలాసము 14. సతీదానశూరము 15. భక్తవత్సల విలాసము 16. గంగాపార్వతీ సంవాదము 17. పంచరత్న ప్రబంధము 18. విష్ణుపల్లకి సేవాప్రబంధము 19. శంకరపల్లకి సేవాప్రబంధము 20. త్యాగవినోద చిత్రప్రబంధము అను నిరువదియు శహాజీ రచించిన యక్షగానములు. వీనిలో మొదటి పదునాఱును నాటకములనియుఁ దుదినాల్గును ప్రబంధములనియుఁ బేర్కొనఁ బడినవి. నాటకములన్నియు నుదార వేషభాషా భూషితములు ; సంవాదశైలిలో రచింపఁబడిన వచనము లెక్కువగాఁగలవి. ప్రబంధములు "నాట్యోద్దిష్ట గీతిబంధ ప్రకృష్టములు." ఇందలి సూత్రధార వచనములను బట్టియు ప్రయోగ సూచనలనుబట్టియు నివి యన్నియు నాఁడు ప్రదర్శితములైనట్లే తోఁచుచున్నది.

వాసుదేవకవి, నివర్తి శేషాచలపతి, బాలకవి సుబ్బన్న, రామకవి, దర్భా గిరిరాజు అనువారు శహాజీ ఆస్థానమునందే యుండి పెక్కు యక్షగానములను

రచించి యుండిరి. అందు శాహరాజవిలాసము ( శేషాచలపతి ) లీలావతీశాహరాజీయము, శాహామహారాజకల్యాణము ( బాలకవిసుబ్బన్న ) శాహేంద్రచరితము ( గిరిరాజు ) అనునవి శహాజీ నాయకములైనట్టివే. గిరిరాజకవి తొలుత శహాజీ యాస్థానమునను దరువాత నతని సోదరుఁడైన శరభోజీ యాస్థానమునను గూడ నుండెను.

తంజావూరు నాయకరాజులలో రఘునాథుని కుమారుఁడగు విజయ రాఘవుఁడు పెక్కితరకావ్యములతోపాటు పదుమూఁడింటికిఁ బైఁగా యక్షగానములను రచించినట్లు తెలియుచున్నది. అతఁడు తన యాస్థానకవులు పలువురిచేఁ బ్రశస్తములైన యక్షగానములను రచింపఁజేసెను. యక్షగానము లందమితమైన యాదరము ప్రదర్శించి వానికొక విశిష్టమైన సాహిత్యగౌరవము కల్పించినవాఁడు విజయరాఘవుఁడని చెప్పుటలో నతిశయోక్తి లేదు. అతఁడు తన యక్షగానములందు గేయధర్మమునకంటె రూపక కళకెక్కువ ప్రాధాన్య మొసంగుటయేకాక యుద్దేశ పూర్వకముగా వానికి నాటకములని పేరుపెట్టెను. అతనిచేత దేశిపద్ధతికిఁ జెందిన యక్షగానము మార్గపద్ధతికిఁ జెందిన నాటకముగాఁ బరిణమించుట కారంభించెనని చెప్పవచ్చును. అతని తరువాతఁ గొంతకాలమునకు తంజావూరు సింహాసనము నధిష్ఠించిన శహాజీ పలువిధముల నపర విజయరాఘవుఁడను ప్రశంసకుఁ బాత్రత గడించుకొన్నవాఁడు. వారిరువురును గీతి సాహితీప్రియులు ; నాట్యకళా నిష్ణాతులు ; శృంగారహాస్య చతురాననులు.

ఆంధ్రమున నైదువందలకుఁబైఁగా యక్షగానములు రచింపఁబడినవి. యక్షగానములు తమిళ కన్నడములందుఁగూడ గోచరించును. మలయాళమునఁ దత్ప్రతిరూపమైన కథాకళి ప్రసిద్ధిచెందినది. యక్షగానము తొలుత నాంధ్రమునందే పరిణతినంది యందుండి తరువాతఁ గ్రమముగా నితర దాక్షిణాత్యభాషలకు వ్యాపించి యుండును. అది యాంధ్రమున దేశి సాహిత్యప్రక్రియలకెల్ల శిరోమణియై ప్రత్యేకశాఖగాఁ బ్రవర్ధిల్లినది.

యక్షగానముల యుత్పత్తిని గూర్చి శ్రీ డా. యస్వీ. జోగారావుగారు తమ యక్షగానముల చరిత్రలో మూఁడు ప్రధానములైన వాదముల నుటంకించి యున్నారు. అందొకటి యక్షగానములకు జక్కులతోఁగల సంబంధమును దెల్పు శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారి వాదము. రెండవది ద్రవిడదేశపు దృశ్య ప్రబంధవిశేషమగు కొఱవంజి లేక కురవంజి నుండి యక్షగాన ముత్పన్నమై యుండునని తెల్పు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వాదము. మూఁడవది యక్షగానము కొయ్యబొమ్మల, తోలుబొమ్మల ఆటనుండి పరిణమించినదని తెల్పు శ్రీ డా. నేలటూరి వేంకటరమణయ్యగారి వాదము. వీనిలో జక్కులతో యక్షగానములకు సంబంధము కలదని తెల్పు వాదమే యెక్కువ సమంజమై యక్షగాననామమును సార్థకముచేయుచున్నది. జక్కులపాటయను పదమే సంస్కృతీక రింపఁబడి యక్షగానమయ్యెనను శ్రీ ఆదినారాయణశాస్త్రిగారి యభిప్రాయము నంగీకరించినచో యక్షులకంటె జక్కులే పూర్వులని చెప్పవలసి యుండుననియు నప్పుడు జక్కులజాతి యెట్లేర్పడెనను విషయము పెద్ద యక్షప్రశ్నమై కూర్చుండు

ననియు, గ్రంథ శాసనాది ప్రమాణములవలన యక్ష జక్క శబ్దములలో యక్ష శబ్దమే ప్రాచీన తరమని దృఢపడుచున్నదనియు, యక్షశబ్దమునుండి జక్కశబ్దము నుత్పన్నము చేయుటకు భాషాశాస్త్రసంబంధమగు విప్రతిపత్తి యేమియులేదనియు శ్రీ డా. జోగారావుగారు వెల్లడించిన యభిప్రాయము నంగీకరింపవచ్చును. శ్రీ డా. వేంకటరమణయ్యగారుకూడ బౌద్ధయుగమం దాంధ్రదేశమున యక్ష జాతివారు కొందఱు వసించి యుండిరనియు, యక్షగానమునకు వారితో నేదో సంబంధముండినట్లు తోఁచుచున్నదనియు సూచించియున్నారు.

యక్షులనఁగనే మనకు దేవయోనివిశేషులును కుబేరానుచరులునైన యక్షులు స్మృతికిఁ దగులుదురు. "యక్షాశ్చనాగా అపి కిన్నరాశ్చ గాంధర్వ ముఖ్యా అపి గానలోలాః" అని కిన్నరాదులతోపాటు యక్షులకును గానలోలత్వ మొకలక్షణముగాఁ జెప్పఁబడినది. యక్షులు నృత్యగాన కళాకోవిదులనుటకు సంస్కృతవాఙ్మయమున ననేక నిదర్శనము లున్నవి. కాని దివ్యులైన యా యక్షుల నుండి కంటె భూలోకవాసులైన యక్షులనుండియే యక్షగాన ముత్పన్నమై యుండు ననుట శ్రీ డా. జోగారావుగారు చెప్పినట్లెక్కువ సమంజసముగానుండును. భౌములైన యక్షులుకూడ నుండిరనుటకు నిదర్శనము లున్నవి.

ఆంధ్రదేశమున విద్యావివేక ఘనులగు ప్రాచీన జాతులవారిలో జక్కులు, బవినీడులు మున్నగువారు మిక్కిలి ప్రాచీనులని శ్రీ ఆదినారాయణశాస్త్రిగారు సూచించియున్నారు. బౌద్ధ యుగమున నాంధ్రదేశమందు యక్షజాతివారు కొందఱు నివసించినట్లు శ్రీ డా. వేంకటరమణయ్యగారు తెలిపియున్నారు. జక్కులనువారు నేటికిని ఆంధ్రదేశమున గుంటూరు గోదావరీ మండలములందును తెనాలి, పెద్దాపురము మున్నగు ప్రాంతములందును గానవచ్చుచున్నారు. వారికి నాట్యముతోఁగల సంబంధమును ఇ. థర్స్టనుగారు Castes and Tribes of South India అను తమ గ్రంథమునఁ దెల్పియున్నారు. రాయలసీమయందలి జక్క సముద్రము, జక్కసానికుంట్ల, జక్కుల చెఱువు మున్నగు గ్రామనామములా ప్రాంతమున జక్కులవారి ప్రాచుర్యమును సూచించుచున్నవి. "మార్వారు గంధర్వజాతి సామ్యమున మన రాష్ట్రమున నున్న జక్కులజాతి యొకప్పుడు ఆ యక్షగానమును ప్రధాన వృత్తిగా నవలంబించిన జాతియనియు, వారివృత్తికి సంబంధించిన యక్షశబ్దము వారికి జాతివాచకముగా పరిణమించియుండుననియు నూహింపవచ్చును." ప్రాచీన కాలమున సింహళమందు యక్షులు కొంతకాలము పాలించినట్లు చరిత్రజ్ఞులు చెప్పుచున్నారు. అచట నేటికిని 'వడ్డా' జాతివారి యక్షారాధన ప్రధానములైన మత సంబంధి నృత్యములు జరుగుచుండునఁట. కళాత్మకములైన గీత నృత్యములు ప్రాచీన కాలమునుండియు మత ప్రచార సాధనములుగానుండుట సుప్రసిద్ధము. పూర్వమెప్పుడో మత ప్రచారమునకో మఱెందుకో యక్షజాతివారు సింహళమునుండి యాంధ్ర కర్ణాటదేశముల కరుదెంచి యుందురనియు, నాంధ్ర దేశమందలి జక్కులవారును కన్నడ దేశమందలి ఎక్కల గాణలు లేక ఎక్కడిగలు అనువారును వారిసంతతివారై యుందురనియు నూహింపవచ్చును. యక్ష శబ్దము నుండి జక్క, ఎక్క శబ్దముల నుత్పన్నములు కావించుటకు క్లేశపడనవసరము లేదు.

యక్షగాన మిప్పుడు దేశీయ రూపక విశేషముగాఁ బరిగణింపఁబడుచున్నది. కాని యది మొదటినుండియు రూపక విశేషముగా నుండినట్లు కనఁబడదు. పాల్కురికి సోమనాథుఁడు పండితారాధ్యచరిత్ర పర్వతప్రకరణమున శివరాత్రి జాగరణ సందర్భమునందు యాత్రికుల వినోద కాలక్షేపములను వర్ణించుచు

"ఆదట గంధర్వ యక్ష విద్యాధ
రాదులై పాడెడు నాడెడువారు (రి)
విధమునఁ బ్రచ్ఛన్న వేషముల్ దాల్చి
యధికోత్సవము దులుకాడ నట్లాడు"

వారిని బ్రశంసించి యున్నాఁడు. దీనినిబట్టి కొంచ అప్పుడు యక్ష గంధర్వ విద్యాధరాదుల వేషములుధరించి యాటపాటలు కావించెడివారని తెలియుచున్నది. శ్రీనాథుఁడు భీమఖండమున దక్షారామమును "కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు గాంధర్వమున యక్షగానసరణి" నని ప్రశంసించియుండెను. యక్షగానమను సమాసపదము ప్రయోగమున కాంధ్ర వాఙ్మయమున నిదే ప్రథమ దృష్టాంతము. దీనినిబట్టి శ్రీనాథుని కాలమున నదియొక ప్రత్యేగాన సరణియై యుండినట్లు వ్యక్తమగుచున్నది. క్రీడాభిరామమున జక్కుల పురంధ్రిపాటయు, యక్షకన్యల నృత్యమును వర్ణింపఁబడినవి. జక్కుల రేకులను పదములును, జక్కిణియను నృత్యప్రబంధ విశేషమును వీరిపేరును బట్టి యేర్పడినవే యని యూహింపవచ్చును. తాళ్ళపాక చిన తిరుమలాచార్యుఁడు తమ తాత అన్నమాచార్యుని సంకీర్తన లక్షణమను సంస్కృతగ్రంథము నాంధ్రీకరించుచు

యక్షగాన పదంబులు నవ్విధమున
సముచితానేక విధతాళసంగతులను
నవరసాలంక్రియా సవర్ణంబులగుచు
నలరు

నని వ్రాసియున్నాఁడు. దీనినిబట్టి యక్షగాన పదములు బహువిధ తాళసంగతములును నవరసాలంకార సమంచితములునని తెలియుచున్నది. కన్నడ వాఙ్మయమునఁ గూడ ఎక్కల గాణలగానము ప్రసక్తమై యున్నది. మల్లినాథ పురాణమున యక్షాందోళనమను నృత్యము కూడ వర్ణింపఁబడినది. పై యుదాహరణములవలన యక్షగానము తొలుత నృత్యానుకూలమైన గాన విశేషమై యుండెనని యూహింపవచ్చును. పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరితమునందలి యుదాహరణమునఁ గూడ నర్తకులును గాయకులును యక్ష గంధర్వ విద్యాధరాదుల వేషములు వేసికొనుచుండిరని సూచింపఁబడినది. కాని రూపకములందువలెఁ బాత్రల వేషములను వేసికొనుచుండిరని వర్ణింపఁబడియుండలేదు. క్రీ. శ. 15 వ శతాబ్ది సగము భాగము వఱకును యక్షగానమనునది యొక గాన విశేషమేయై యుండెననియుఁ దరువాత నది నృత్యగాన విశిష్టమును దేశి కవితా ప్రచురమును నైన రూపక విశేషముగాఁ బరిణమించెననియు భావింపవచ్చును.

వస్తు భాషాచ్ఛందోవిశేషాదులను బురస్కరించుకొని చూచినచో యక్షగానములందు మార్గదేశిలక్షణ మిశ్రణము గోచరించినను అందుమార్గపుఁ బాలు

కంటె దేశిపాలే హెచ్చు. సంస్కృతమునందలి కొన్ని యుపరూపకములకును యక్షగానములకును గొంత సాదృశ్యము గోచరించును. అట్లే కాలక్రమమున సంస్కృత నాటకలక్షణములు సైతము కొన్ని యక్షగానము లందుఁ బ్రవేశించినవి. ఇంత మాత్రమున నా రెండింటికిని జన్యజనక భావము కలదని తలంచుట యుక్తము కాదు. ఇట్లే హరికథలకును యక్షగానములకును గొంత సాదృశ్యముండుటచే నవి యొండొంటినుండి యుత్పన్నములైనవని భావింపరాదు. శ్రీ బాగేపల్లి అనంత రామాచార్యులుగారు, శ్రీమదజ్జాడాదిభట్ట నారాయణదాసుగారు, శ్రీ పసుమర్తి కృష్ణమూర్తిగారు మున్నగువారు తమ హరికథలను యక్షగానములనియే పేర్కొనిరి. కాని హరికథా యక్షగానముల ప్రయోగపద్ధతియందును ప్రయోజనమందును సామ్యముకంటె వైషమ్యమే హెచ్చు. మలయాళము నందలి కథాకళికిని యక్షగానములకును గొంత పోలిక యున్నట్లే భేదమును గలదు. కథాకళి మూకాభినయము. సంభాషణలు పాటలు నేపథ్యగతులు చేయుదురు. యక్షగానములందట్లు గాక నటులే పాటలు పాడుచు సంభాషణలు కావించుచుఁ దదనుగుణముగా నభినయము సాగింతురు. అందుచేఁ గతిపయలక్షణ సామ్యమునుబట్టి వాని కుత్పత్తి స్వరూపసామ్యమును భావించుట యుచితముకాదు.

ఆంధ్రమునందలి రూపకములని చెప్పఁదగిన యక్షగానములలో క్రీ. శ. 15వ శతాబ్ది యుత్తరార్ధమున ప్రోలుగంటి చెన్నశౌరి రచించిన సౌభరిచరితము మొదటిదిగాఁ బరిగణింపఁబడుచున్నది. అది జక్కుల కథయని పేర్కొనఁబడినది. అది యిప్పుడు లభించుటలేదు. క్రీ. శ. 1500 ప్రాంతము వాఁడైన వెల్లంకి తాతంభట్టు కవి చింతామణియను లక్షణ గ్రంథమునఁ బేర్కొనియుండిన లక్ష్మీకల్యాణము కూడ యక్షగానమేయై యుండునుగాని యదియు లభించుటలేదు. అది యత్కర్తృకమోకూడఁ దెలియదు. చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహమున త్రిపుటరేకు, జంపెరేకు, రచ్చరేకు, ఆటతాళము మున్నగువానిని బేర్కొని "యక్షగానాదికృతులలో నార్యులిడిన రగడ భేదంబులివియా" నని చెప్పియుండెను. ఇట్లొక లాక్షణికుఁడు యక్షగానములను బేర్కొనుటనుబట్టి యట్టి కృతు లప్పటికిఁ బ్రచారము నందుండె ననియే భావింపవచ్చును.

ఉపలభ్యమానములగు నాంధ్రయక్షగానములలో మొదటిది కందుకూరి రుద్రకవి రచించిన సుగ్రీవ విజయము. చక్రపురి రాఘవాచార్యుల కృతియైన విప్రనారాయణ చరిత్ర మింతకంటెఁ బ్రాచీన తరముగా గోచరించుచున్నదనియు, నీ రెండింట రచనాసామ్యము స్ఫుటముగాఁ గనవచ్చుచున్నదనియు శ్రీ డా. జోగారావుగారు చెప్పుచున్నారు. క్రీ. శ. 16 వ శతాబ్దిలో సుప్రసిద్ధులైన కవులు పలువురు యక్షగానరచనకుఁ గడంగిరనియు, రుద్రకవి యందొకఁడనియు, నతని సుగ్రీవ విజయము జనార్దనదేవుని వసంతోత్సవ సమయమందు మొదటఁ బ్రదర్శింపఁబడి యుండెననుటకు సందేహము లేదనియు శ్రీ డా. వేంకటరమణయ్యగారు తెల్పియున్నారు. క్రీ.శ.1600 ప్రాంతమున కంకంటి పాపరాజు, తేకుమళ్ళ రంగశాయి, బాలపాపాంబ మున్నగువారు రసవంతములైన యక్షగానములు రచించియుండిరి. భరతవిద్యా ప్రవీణులైన కూచిపూడి భాగవతులు యక్షగానములను హ్రాసయా

వర్జకముగాఁ బ్రదర్శించి వానికిఁ బ్రశస్తిప్రచారములు కలిగించిరి. క్రీ. శ. 17 వ శతాబ్ది యుత్తరార్ధమున సిద్ధేంద్రయోగి నృత్యప్రధానమైన కలాపమును నపూర్వ సృష్టి కావించెను. దాని ప్రభావము తరువాతి యక్షగానములపై నధికముగాఁ గన్పట్టును. 17 వ శతాబ్ది ప్రారంభమునుండి దక్షిణదేశము నందును దరువాత తెలంగాణమునందును యక్షగానములు విరివిగా రచింపఁబడి ప్రదర్శితములైనవి. చెర్విరాల భాగయ్య, బూరుగుపల్లి సోదరులు మున్నగువారు తెలంగాణమునందలి యక్షగాన కర్తలలోఁ బేర్కొనఁదగినవారు.

పూర్వలాక్షణికులలో యక్షగానమున కిదమిత్థమని పర్యాప్తముగా లక్షణ నిర్వచనము కావించిన వారెవ్వరును లేరు. చిత్రకవి పెద్దనయు అప్పకవియు యక్షగానమునందలి ప్రధానాంగమైన రేకు లక్షణము మాత్రము చెప్పియుండిరి. సుగ్రీవవిజయమువంటి సుపరిణతమైన యక్షగాన మవతరించిన పిమ్మట నివసించిన అప్పకవివంటి యుత్తమలాక్షణికుఁడు సైతము తనకుఁ బూర్వుఁడైన పెద్దన చెప్పిన లక్షణమునే పునరుక్తముచేసెను. కాని ప్రత్యేకముగా దాని లక్షణము నేర్పరించుటకు యత్నించియుండలేదు. అప్పటికి వివిధస్వరూప ప్రయోజనములతో బహుముఖములఁ బరిణామము పొందుచుండిన యాప్రక్రియకు నిష్కృష్టముగా లక్షణముచెప్పుట క్లేశకరముగాఁదోఁచుటచేఁ గాఁబోలు నాతఁడట్లుచేసి యుండలేదు.

శ్రీ డా. జోగారావుగారు సాహిత్య ప్రక్రియాపరముగా యక్షగానమునకీ క్రిందిస్థూల నిర్వచన మొసంగియున్నారు. "యక్షగానమం దితివృత్త మెట్టిదైనఁ గావచ్చును. రచనా ప్రక్రియ దృశ్యముకాని శ్రవ్యముకాని కావచ్చును. ఏ ప్రక్రియయందైనను గీతిధర్మము విహితము. అందురాగతాళములలోనొకదానికిఁదగు ప్రాధాన్యముగలరచనా విశేషములు (రేకు, దరువు, పదము, కీర్తన మొదలగునవి) ద్విపద (మంజరియును) పద్యములు (జాత్యుపజాతి వృత్తములు, అర్ధ పద్యములు, సంస్కృతశ్లోకములును) వచనము (సంధిప్రయోజనాత్మకముకాని సంవాదాత్మకము కాని వర్ణనాత్మకమైనను గాఁదగును) చూర్ణికలు విన్నపములు మొదలగుగద్య ప్రభేదములు నుండఁదగును. ఏలాది గీత ప్రబంధ విశేషముల ప్రయోగమైచ్ఛికము." ఆం. య. చ. పుట 215.

సంస్కృత నాటకములలోఁ బ్రస్తావనాంతమున నటీ సూత్రధారులు పాత్ర ప్రవేశ సూచనకావించి నిష్క్రమింతురు. తరువాత నిర్దిష్టపాత్ర ప్రవేశించి యన్య పాత్రలతో సంభాషణము సాగించును. ఒక్కొక్కప్పు డంకములనడుమఁ బాత్రల సంభాషణమునందే నూత్న పాత్రప్రవేశము సూచింపఁబడును. ఇది యైచ్ఛికమే కాని యనివార్యముకాదు. ప్రస్తావనయందే కాని యన్యత్ర సూత్రధారున కందుఁ బ్రసక్తియుండదు. యక్షగానములందు సూత్రధారుఁడు ఫలానాపాత్ర ప్రవేశించుచున్నదని సూచింప నాపాత్ర పద్యమునందో గేయమునందో తన ప్రవేశమును దానే వర్ణించుకొనుచుఁ బ్రవేశించును. తరువాత నేపాత్ర యేపాత్రతో సంభాషించునో యదియు సూత్రధారుఁడే సూచింపఁ బాత్రల సంభాషణము సాగుచుండును. ఈ విధముగానందు సూత్రధారుని సంధివచనము లడుగడుగునను గోచరించుచుఁ గథాగమనమును నిర్వహించుచుండును. యక్షగానములందు భాషా

ప్రయోగము వైవిధ్య శోభితమై యుండును. అది పాత్రల దేశకాల వయోవృత్తి వర్ణాదులనుబట్టి మాఱుచుండును. అట్లే వానియందు లోకప్రవృత్తి విశదముగా వర్ణింపఁబడుచుండును. ఆయా ప్రాంతములందా యాకాలములం దాంధ్రులందలి పలువృత్తులవారు పలువర్ణములవారు మాటాడుచుండిన భాషావైఖరిని బరిశీలించుటకును దత్కాల రాజకీయమత సాంఘిక ప్రవృత్తుల నెఱుంగుటకును యక్షగానములవంటి సాధనము లన్యములు కానరావు. అందు నృత్యగానములకుఁ బ్రాధాన్య మెక్కువ. వానిని బ్రౌఢకవులును సామాన్యులును గూడ రచించి యుండిరి. రచించినకవుల పాండితీ ప్రతిభాదికమునుబట్టి వానియందలి ప్రౌఢి పరిపాకమునఁగూడ భేదము గోచరించును. దేశిపద్ధతికిఁ జెందిన వగుటచే యక్షగానములన్నియు నప్రౌఢములని భావించుట పొరపాటు.

శహాజీ రచించిన ఈ సీతాకల్యాణ యక్షగానము నందలి యితివృత్తము శ్రీ సీతారాముల వివాహము. దానితోపాటు భరతలక్ష్మణ శత్రుఘ్నులు మాళవ్యూర్మిళా శ్రుతకీర్తులను వివాహమాడిన వృత్తాంతముకూడ నిందు వర్ణింపఁ బడినది. యక్షగానారంభమునకు ముందు శ్రీరామస్తుతి పూర్వకములైన శ్లోకము లున్నవి. ఇవి లేఖకులు చొప్పించినవి కావచ్చును. ఇందు రెండు మూఁడు శ్లోకములు శార్దూల స్రగ్ధరా వృత్తముల యర్ధభాగములు. తరువాత జయాది యైన జంపెతాళము రామకృష్ణుల నభేదాధ్యవసాయముతోఁ బ్రశంసించుచున్నది. పిమ్మట శంకరునికి శరణమును మహిషాసురమర్దనికి మంగళమును జెప్పఁబడినవి. ఇవి సంస్కృత భాషలోనున్నవి. అనంతరము విఘ్నేశ్వరవాణీ కృష్ణపరమేశ్వర వందన పూర్వకములైన శ్లోకములున్నవి. అనంతరము కృష్ణదేవుని వీక్ష శాహ భూపాలునికి శ్రీనొసంగుఁగాకయను నాశీర్వచనమున్నది. తరువాత శాహజీ పాండిత్య విశేషమును, సభాస్థిత కవివర సాహిత్యప్రౌఢిని, తన (ఇది సూత్ర ధారునిదై యుండవచ్చును) అభినయ పారంగతత్వమును వర్ణించు శ్లోకమున్నది. ఇది రత్నావళ్యాదులలోని ప్రరోచనాత్మక శ్రీహర్షోనిపుణః కవిరిత్యాదిశ్లోకమును బోలియున్నది. తరువాత శాహజీకి సంబంధించిన కైవారము వ్రాయఁబడినది. ఈ కైవారమునకు ముందున్న దేవతాస్తుతి, శాహజీ మహారాజాశీః ప్రరోచ నాత్మకములైన శ్లోకము లాస్థాన విద్వాంసులు రచించినవి కావచ్చును. పిమ్మట ద్విపదలో యక్షగానము నందలి కథ సంగ్రహముగాఁ జెప్పఁబడినది.

తొలుత దేవతాస్తుతిలో విఘ్నేశ్వర స్తుతి కావింపఁబడినను మరలఁ గథా రంభమున విఘ్నేశ్వర ప్రవేశము వర్ణింపఁబడినది. బహుశః శ్రీ డా. జోగారావు గారు సూచించిన ట్లిచ్చట విఘ్నేశ్వర వేషధారియైన బాలుఁడొకఁడు ప్రవేశించి నృత్యగానములు నిర్వహించును గాఁబోలును. తరువాత నాస్థాన సంతోషియైన కటికవాఁడు ప్రవేశించి హెచ్చరిక తెలిపిన యనంతరము జనకమహారాజు కొలువు ప్రవేశించెను. రాజ ప్రవేశమునకు ముందీ కటికవానిని బ్రవేశపెట్టుట శాహజీ యక్షగానము లన్నింటియందును సామాన్యమే.

జనక మహారాజు కొల్వునకు వచ్చినపిమ్మట మంత్రియుఁ బురోహితుఁడైన వామదేవుఁడును గొల్వున కరుదెంచిరి. జనకుఁడు "సీత జవ్వనియైనది. శివ ధనుస్సెక్కు పెట్టిన వారికా మెనిచ్చెదను. స్వయంవరము చాటించి రాజవరులను వేగమే పిలిపింపవలయు"నని పలికెను. మంత్రి పురోహితులు పట్టణము శృంగారించుటకై తలవరులఁ బిలిపింప వారరుదెంచిరి. పురాలంకరణానంతరము సీతా స్వయంవరము చాటింపఁబడెను. ఆవార్త విని సకల దేశాధీశ్వరులు వచ్చుసమయమున వారికి విడుదులు మున్నగునవి యమర్చుటకై కుంటికరణమువాఁడు వచ్చెను. పిమ్మట మగధాధీశ్వరుఁడు, మాళవేంద్రుఁడు, సింధురాజు, మున్నగు రాజులందఱు నరుగుదెంచిరి. తరువాత నాటకశాలా స్త్రీలు కొల్వు ప్రవేశించిరి. పిమ్మట సీతా స్వయంవర వార్తవిని విశ్వామిత్రమౌని రామలక్ష్మణులతోఁగూడి మిథిలా నగరమునకు వచ్చెను.

తరువాత జనకునానతిపై సీత సఖిజన పరివృతయై స్వయంవర మండపమున కరుదెంచెను. అఱువదివేల మంది కింకరులు శివధనుస్సు నచ్చటికిఁదెచ్చిరి. అంత జనకునభిమత మెఱింగి వామదేవుఁడు స్వయంవరాగత రాజులతో "హరువిల్లెక్కు పెట్టిన వారికి సీత నిత్తునని జనకుఁడు ప్రతిన యొనరించినాఁడు. కావున మీరట్లొనరించి సీతను బెండ్లియాడుఁ"డని పల్కెను. ఆ మాటలువిని లాట, భోట, మరాట, కర్ణాట, సింధు, విరాటాది రాజులు శివుని విల్లువిఱుచుటకై బయల్వెడలి, దానిని జూచి, యాపని తమవలనఁగాదని యెఱింగి, నిరాశులై పోయివచ్చెదమని జనకుని కెఱింగించిరి. జనకుఁడంతఁ దానా ప్రతిజ్ఞ చేసినందుకువగచి యింక సీతకుఁ బెండ్లి యెట్లగునని చింతాక్రాంతుఁడయ్యెను. అప్పుడు విశ్వామిత్రుఁడు జనకునితో "ఈ బాలునిచే హరు విల్లెక్కు పెట్టించెదను. సీత నాతనికి"మ్మని పల్కి, జనకుఁడామోదింప, రాముని విల్లెక్కు పెట్టుమని ప్రేరేపించెను. అది చూచి రాజులందఱు నాకార్యము బాలుఁడైన రాముని కసాధ్యమని పరిహాసము లాడఁజొచ్చిరి. విశ్వామిత్రుఁడు రాముని మరలఁ బ్రోత్సహించెను. రాముఁడు శివుని విల్లెడమ చేతఁగైకొని యావిల్లు తనచేతి బలిమికిఁజాలక విఱుగునేమోయని పల్కుచు దాని నెక్కుపెట్టి భగ్నము కావించెను.

విశ్వామిత్రుఁడు రాముని గౌఁగిలించుకొని, శిరస్సుమూర్కొని జనకునిజూచి "రాముఁడు విల్లు విఱిచెను గావున సీతనాతని కి"మ్మని పలికెను. జనకుఁడట్టిముని బాలునకు సీత నిచ్చుటెట్లనియు నీయనిచోఁ బ్రతిజ్ఞా భంగమగుననియుఁ జింతింప మొదలిడెను. వామదేవుఁడంత "వారలు సామాన్య మునిబాలకులుకా" రని తెల్పి వారి వృత్తాంతము విశ్వామిత్రుని వలన సవిస్తరముగా నెఱుంగుమని హెచ్చరించెను. విశ్వామిత్రుఁడప్పుడు రామలక్ష్మణులు దశరథ మహారాజు కుమారులని తెల్పి వారి గుణగణములను బరాక్రమ విశేషములను వివరించెను.

జనకుఁడు సంతోష భరితాంతరంగుఁడై సీతను రామునికిచ్చుట కంగీకరించెను. విశ్వామిత్రుఁడు మంత్రి బాంధవపురోహితులతో దశరథుని బెండ్లి కాహ్వానింపుమని జనకుని కుపదేశించెను. జనకుఁడు వేగుల వారితోఁగూడ మంత్రి నయోధ్యా నగరమునకుఁ బంపెను.

ఆసమయమున నంగవంగకళింగావనీపతులు కొలువ దశరథుఁడు పేరోలగంబుండి రామలక్ష్మణులురాక తామసించుటకుఁ గారణమేమని వసిష్ఠునడిగి చింతాక్రాంతుఁడయ్యెను. అంత కటికవాఁడు మిథిలామాత్యునిరాక నెఱిఁగించెను. ఆమంత్రివచ్చి జనకుఁడువ్రాసిన లేఖను దశరథునికొసంగెను. అందు రాముఁడు హరధనుర్భంగము కావించుటయు, వైశాఖపూర్ణిమనాఁడు వివాహలగ్నము నిశ్చయింపబడుటయుఁ దెల్పి జనకుఁడు దశరథుని మంత్రి బాంధవ పురోహితులతోఁగూడ మిథిలానగరమున కాహ్వానించియుండెను.

దశరథుఁడు మంత్రి సామంత పుత్రమిత్రాది పరివేష్టితుఁడై మిథిలానగరమున కరుదెంచె. జనకుఁడు వారి నుచితవిధమున నెదుర్కొని దశరథునితో "రాజేంద్ర! నీకుమారుఁడు రాముఁడు శివునివిల్లువిఱిచి భుజబలసంపదచే సీత నార్జించుకొన్నాఁడు. నా తనయలైన మాళవి, ఊర్మిళ, శ్రుతకీర్తి అనువారిని భరత లక్ష్మణ శత్రుఘ్నుల కొసంగి యీ ముహూర్తముననే వివాహము కావించెదను. గ్రహింపు" మని వేడుకొనెను. దశరథుఁడు జనకుని వంశమును బొగడి యందుకంగీకరించెను. జనకుఁడు దశరథునితో వియ్యమందఁగలిగినందున ధన్యుఁడనైతినని తలంచుచుఁ గన్యకలను రప్పించెను. తరువాత నతఁడు సీతను రామునికిని, మాళవిని భరతునికిని, ఊర్మిళను లక్ష్మణునికిని, శ్రుతకీర్తిని శత్రుఘ్ననకును సంకల్పపూర్వకముగా నిచ్చి పాణిగ్రహణము కావించెను. అప్పుడు నారదుఁడును గిన్నర కింపురుషులును సీతారాములకును శాహమహీపాలునికిని మంగళమగుఁగాక యని మంగళములు పాడిరి.

ఇది సీతాకల్యాణయక్షగానమునందలి కథ. చిన్న చిన్న మార్పులచ్చటచ్చట నున్నను ఇది రామాయణకథానుసారిగనే యున్నది. స్వయంవరాగతులైన రాజు లెవరో రామాయణమునఁ జెప్పఁబడియుండలేదు. జనకుఁడు విశ్వామిత్రునికిఁ దాను శివునివిల్లు విఱుచువారికి సీతనిత్తునని ప్రతిజ్ఞచేయుట యెఱిఁగించి, పలువురు రాజు లరుదెంచి యా వింటి నెత్తఁజాలక తాను సీతనీయమికిఁగినిసి తనపై దండెత్తిరనియుఁ, దానంత సురల యనుగ్రహమున సైన్యగనులఁబడసి వారినోడించెననియుఁ దెలిపినట్లు రామాయణమునఁ గలదు. శాహజీ యా వృత్తాంతమును విడిచివైచి, స్వయంవరాగతులైన రాజులపేర్లు తెల్పి, వారు హరువిల్లు మోపెట్టలేక తమ యసామర్థ్యమును దామె జనకునికెఱింగించినట్లు రచించెను. రాముఁడు హరధనుర్భంగము కావించుతఱి నితరరాజులు పరిహసించిన వృత్తాంతముకాని, ధనుర్భంగానంతర మీ మునిబాలకునికి సీతనెట్లిచ్చుటయని జనకుఁడు విచారించినవృత్తాంతము కాని రామాయణమునఁ గానరావు. రామాయణమునందలి మాండవిని శాహజీ మాళవియని పేర్కొనెను. రామాయణమున సీతయు నూర్మిళయు జనకుని కూఁతులనియు మాండవీశ్రుతకీర్తు లతని తమ్ముఁడైన కుశధ్వజుని కూఁతులనియుఁ

గలదు. శాహజీ వారినందఱిని జనకునితనయలుగానే పేర్కొనెను. తమ్ముని కూఁతులు వరుసకు జనకునికిఁగూడఁ గూఁతులేయగుటచే శాహజీ యట్లు వ్రాసి యుండవచ్చును. మాండవ్యాదులను భరతాదుల కీయవలెనని దశరధుఁడే యభిల షించినట్లు రామాయణమున నుండ శాహజీ జనకుఁడే యా ప్రతిపాదన కావించి నట్లు వ్రాసెను. ఈ మార్పుచితముగనే యున్నది.

కథాగమనమును సత్వరముగా సాగించుటలో శాహజీ మిక్కిలి శ్రద్ధ వహించెను. జనకుఁడు కొల్వునఁ బ్రవేశించినది మొదలు సీతారామాదుల వివాహము ముగియువఱకుఁ గథ వాయువేగమున నడచిపోయెను. పట్టణము శృంగారించుటకై తలవరులను, స్వయంవరాగతులైన రాజులకు విడుదులు సమకూర్చుటకై కరణము వాఁడును, దశరధునికడకు లేఖఁగొనిపోవుటకై వేగులవారును బ్రవేశించుట యక్షగానోచితముగానున్నది. జనకుఁడు దశరధునికి వ్రాసినకమ్మ విధానముగమనింపఁ దగినది. స్వయంవరమండపమునకు సకలదేశరాజులును వచ్చిన పిమ్మట యక్షగానమున నాటకశాలాభామల ప్రవేశము వర్ణింపఁబడినది. ఈ భామలు మొదట నొక సీసమునను దరువాత దరువునను విపులముగా వర్ణింపఁబడియున్నారు. ఈ వర్ణనము హృద్యముగనే యున్నది కాని యా పునరుక్తి యనవసరము. అసలా స్వయంవర సన్నాహమున నాటకశాలాభామలప్రవేశమున కావశ్యకతయేమో పరిశీలింపవలసియున్నది. ఈ ప్రవేశవర్ణన మావశ్యకతనుకంటెఁ దద్వర్ణనమున శాహేంద్రునకుఁగల యాసక్తినే యెక్కువగా సూచించుచున్నది.

పై నాటకశాలాభామలవర్ణన సందర్భమునను, స్వయంవరమండపమున కరుదెంచు సీతను వర్ణించు సందర్భమునను, వివాహోత్సవమునకుఁ బూర్వము సీతను దత్సోదరులను వర్ణించు సందర్భమునను శృంగారరసచ్ఛాయలున్నవి. ఆస్థానసంతోషియైన కటికవానిని, కుంటికరణమువానిని వర్ణించు సందర్భమున శాహజీ వారియాకృతులందలి వికృతత్వమును వెల్లడించి హాస్యమును బ్రకటించెను. స్వయంవరమండపమున కరుదెంచురాజులను, రాముని ధనుర్భంజనమును వర్ణించు నెడ వీరమున్నది. రాజులు విల్లెక్కుపెట్టలేక నైరాశ్యమును బ్రదర్శించినప్పుడు జనకుఁడు వెల్లడించిన భావములందును, రామలక్ష్మణుల రాక ఆలస్యముచేసిరని దశరధుఁడు దుఃఖితుఁడై వెల్లడించిన భావములందును గరుణరసమున్నది. మొత్తము మీఁద శాహజీ యీ యక్షగానమున రసపోషణవిషయమున నెక్కువశ్రద్ధ వహించి నట్లు కానరాదు.

స్వయంవరాగతులైన రాజులు శివునివిల్లుగాంచి మొదట దానిని మోపెట్టి సీతను గ్రహింపవలెనని యుత్సాహము ప్రదర్శించిరి. తరువాత వారు దానినెత్త లేక తమలోఁ దామనుకొనిన పల్కులు సహజములుగా నున్నవి. అట్లే శ్రీరాముఁడు

విశ్వామిత్రప్రేరితుఁడై విల్లెక్కుపెట్టఁగడంగునప్పుడు వారు కావించిన పరియాచికము వారి మనస్తత్త్వమును జక్కఁగా వెల్లడిచేయుచున్నది. రాజులు తమ యశక్తిని వెల్లడించి తమ తమ పురములకేగుదుమని పల్కినప్పుడు జనకుఁడింకఁ దన ప్రతిజ్ఞనెఱవేరుటయుఁ దన కూఁతునకు వివాహమగుటయు నెట్లని దుఃఖితుఁడగుట యాతని పితృహృదయమును దేటతెల్లముఁగావించుచున్నది. శ్రీరాముఁడు సామాన్యబాలుఁడుకాఁడని వామదేవుఁడు గ్రహించుట యాతని పరేంగితజ్ఞతాపాటవమునకుఁ దార్కాణముగానున్నది. రాముఁడీవిల్లు నా భుజబలమునకుఁ జాలక విఱుగునేమోయనుట యాతని యుదాత్తతాప్రౌఢిమలను సూచించుచున్నది. శాహజీ జనకుని పితృహృదయమును, విశ్వామిత్రుని శిష్యవాత్సల్యమును, దశరథుని పుత్త్రప్రేమను, జక్కఁగా వర్ణించియున్నాఁడు.

శాహజీ వివిధపాత్రల యాకృతివిశేషములను, వేషాలంకారములను వర్ణించుటలోఁ జాల నేర్పు ప్రదర్శించియున్నాఁడు. నాటకశాలాభామలను, సీతను, ఆమె సోదరీమణులను అతఁడు వర్ణించిన తెఱంగు మిక్కిలి హృదయంగమముగానున్నది. వామదేవుని, వసిష్ఠుని, అయోధ్యానగరమునకరుగు వేగులవారిని, స్వయంవరమునకరుదెంచిన రాజులను అతఁడు సహజముగను, ఔచిత్యశోభితముగను వర్ణించెను.

యక్షగానమునఁ గథ వర్ణనకథనాత్మకముగా నడచినను గొన్నిచోట్ల రమ్యమైన సంవాదశైలికూడ గోచరించుచున్నది. అచ్చటనున్న సూత్రధారుని సంధివచనములను దొలఁగించినచో నా సంవాదము హృద్యముగా సాగిపోవును. జనకుఁడు వామదేవుఁడు, జనకుఁడు విశ్వామిత్రుఁడు, జనకుఁడు దశరథుఁడు, దశరథుఁడు వసిష్ఠుఁడు. కావించిన సంవాదము లిందుకు నిదర్శనములు.

శహాజీ యక్షగానారంభమున దేవతాస్తుతిపై సంస్కృత శ్లోకములను వాడినను యక్షగానమునందంతటను దఱుచుగా ద్విపదలను, దరువులను వాడియుండెను. ద్విపదనతఁడు కథనప్రయోజనమునకై యెక్కువగా నుపయోగించుచుండును. దరువు సంస్కృత ధ్రువాభవమని పండితుల యభిప్రాయము. భరతుఁడు ధ్రువాగానము పంచవిధములని పేర్కొనెను. కొందఱది యేకాదశవిధములని చెప్పియుండిరి. భరతుఁడుచెప్పిన ప్రావేశికధ్రువకే యక్షగానములందు విశేష ప్రసక్తి [illegible]చును. అది సాధారణముగా పాత్రవర్ణన ప్రవేశములు, స్వీయోదంతకథనము, ప్రకృతిసన్నివేశవర్ణన, కథానుసంధానము, సంవాదము మున్నగు బహుప్రయోజనములకై యుపయోగింపఁబడుచుండును. శహాజీ యక్షగానములందలి దరువులు మిక్కిలి యపురూపములైనవనియు, నందతని సంగీత సాహిత్య విద్యావైదుష్యవిభవము విశదమగుచుండుననియు శ్రీ డా. జోగారావుగారు తెల్పి యందలి భేదములను వివరించియున్నారు. (పుట 300). శహాజీ జనకునిప్రవేశము సందర్భమున చంపకమాలయును, నాట్యశాలాభామల

ప్రవేశముసందర్భమున సీసమును, వామదేవుని ప్రవేశముసందర్భమున కందపద్యమును వాడియున్నాఁడు. సంధివచనములను జెప్పునప్పుడేకాక సంవాదమునకును అతఁడు వచనమును వాడుచుండును. విశ్వామిత్రుఁడు, వామదేవుఁడు జనకునితోఁ బలికిన వచనములిందుకుఁ దార్కాణములు. దేవతాస్తుత్యనంతరము యక్షగానమున శాహమహారాజును సంబోధించు విశేషణములతోఁగూడిన గద్యకైవారమున్నది. యక్షగానముచివర మంగళమున్నది. ఇందు సీతారాములకేకాక శాహమహారాజునకును మంగళము చెప్పఁబడినది. ఇది యక్షగానమునకు భరత వాక్యమువంటిది.

పద్య ద్విపదా ధ్రువలందు శాహమహారాజు వాడినభాష చాలవఱకు లక్షణానుగుణమును సరళ సుందరమును నై యొప్పారుచున్నది. నిత్యకొల్వు, నిత్యతోరణాలు, భుజబలిమి, వైశాఖనెలను, మున్నగు ప్రయోగము లెడనెడఁ గానవచ్చుచున్నవి. దరువులలో ఎత్తేము, పోయ్యేవు ఎత్తేనదేది, పలికేది, వచ్చేము, ఇచ్చేనెటువలె, చెల్లితే, అను వ్యావహారిక క్రియారూపములు కలవు. ఇవి రాజులు తమలోఁదాము మాటలాడుకొను సందర్భమున మాత్రమే కలవు. ఎత్తుక, పెట్టుక అని యుత్తరపదమైన కొనుధాతువునకు కాదేశమువచ్చిన ప్రయోగములున్నవి. చాలమంది భటులనుటకు చాలాభటులను ప్రయోగమున్నది. "అంగ వంగ కళింగ అవనీశులుకొల్వగ" ననుచోట విసంధి యున్నది. కొల్వుకు అని షష్ఠీవిభక్తికు ప్రత్యయమునకు ముందు నగాగమములేని ప్రయోగమున్నది. సంధివచనములందును సంవాదవచనములందును వ్యావహారికభాష వాడఁబడియున్నది. "వినవయ్యా! జనకమహారాజా, వీరలనుచూస్తే ఋషికుమాళ్ళుగా ఉండలేదు" ఇత్యాదిగాఁగల వామదేవుని వచనమిందుకు నిదర్శనము.

శహాజీ యక్షగానముల సామాన్యస్వరూపమును శ్రీ డా. యస్వీ. జోగారావు గారిట్లు తెల్పియున్నారు. "ఆ గ్రంథములు సాధారణముగా జయేత్యాది యగు 'తోడియం' దరువుతోఁ బ్రారంభమగును. స్తుత్యాదికము, పిదప నొక సూత్రధార వచనమున గ్రంథనామ కర్తృనామనిర్దేశము, నాపైనొక ద్విపదలో కథాసంగ్రహము చెప్పఁబడుట గలదు. కథాసంగ్రహద్విపద ప్రబంధములందుఁ గానరాదు (అతఁడు నాలుగు యక్షగానములను ప్రబంధములని పేర్కొనెను). ముందే వినాయకస్తుతియున్నను కథాసంగ్రహద్విపదకుఁ బిదప నతని యాగమనప్రసక్తి యుండును. అనఁగాఁ బ్రదర్శనవేళ నొక కుఱ్ఱవాఁడెవఁడో వినాయక నేపథ్యముతో రంగమునఁ బ్రవేశపెట్టఁబడి ప్రదర్శకులైన భాగవతుల పూజనందుకొని పోవుచుండు టాచారమై యుండును. ఆ పిమ్మట నాస్థానసంతోషియగు కటికవాని వాలకము ప్రవేశప్రసంగము లుండును. అంతటఁ గథారంభము. గ్రంథాంతమున సాధారణముగా నొక ద్విపదలోఁగాని గద్యలోఁగాని కృతిసమర్పణముండును. ఆ సమర్పణము తఱుచు శహాజీ యిష్టదైవతమగు త్యాగేశ్వరస్వామికై నుండును" సీతాకల్యాణమున నీ కృతిసమర్పణము మృగ్యము.

ఆంధ్రప్రదేశప్రభుత్వమునకుఁ జెందిన "స్టేటు ఆర్కైవ్సు"కు సంచాలకులై యుండినప్పుడు శ్రీ పిడతలసీతాపతిగారు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము

నందున్న యముద్రితములును ప్రశస్తములునైన గ్రంథములను ప్రకటించుటకొక ప్రణాళికను సిద్ధముచేసి యెంతోయుత్సాహముతో నాకార్యమును నిర్వహింపఁ గడంగిరి. చరిత్ర సారస్వత పరిశోధనములందు వారికున్న యుత్సాహాభినివేశము లనితర సాధారణములైనవి. వారిప్రోత్సాహమున నారంభింపఁబడిన నారదీయ పురాణము, ఇందుమతీపరిణయము మున్నగు గ్రంథములు కూడ నచిరకాలముననే ప్రకటితములు కానున్నవి. ఈ సీతాకల్యాణమును సరిచూచి దీని కుపోద్ఘాతము వ్రాయు గౌరవమును నవకాశమును నాకుఁ గల్పించిన శ్రీ సీతాపతిగారికి నా కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాను. ప్రభుత్వ ప్రాచ్య తాళపత్ర గ్రంథాలయ పరిశోధనసంస్థల కిటీవలనే కళాప్రపూర్ణ, వాఙ్మయమహోధ్యక్ష శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు సంయుక్తసంచాలకులుగా నియమింపబడుట ముదావహము. వారు వచ్చినతోడనే యీ గ్రంథమునేకాక యితర గ్రంథములనుకూడ ముద్రింపించుట కారంభించి యాంధ్ర వాఙ్మయమునకుఁ జేయుచున్న సేవ ప్రశంసనీయము. వారి యాధ్వర్యమున నింకను బెక్కు తాళపత్ర గ్రంథములు నిర్దోషముగ ముద్రితములై యాంధ్రుల కానందము కలిగించునని యాశించుచున్నాను. ఈ కార్యమున నాకుఁ దోడ్పడిన స్టేటు ఆర్కైవ్సు ఇతరోద్యోగులకు నా నమస్కారములు.

*దివాకర్ల వేంకటావధాని*

ఉస్మానియా విశ్వవిద్యాలయము

ఆంధ్రశాఖ—హైదరాబాదు 26-10-1971

# సీతాకల్యాణము

## (యక్షగాన నాటకము)

శ్లో॥ రామం, శ్యామాభిరామం,[1] రవిశశినయనం, కోటిసూర్యప్రకాశం
దివ్యం, దివ్యాస్త్రపాణిం, శరముఖశరధిం, చారుకోదండహస్తం
కాలం, కాలాగ్ని రుద్రం, రిపుకులదహనం, విఘ్నవిచ్ఛేదదక్షం
భీమం, భీమాట్టహాసం, సకల భయహరం, రామచంద్రం భజేఽహమ్

* రామం, లక్ష్మణపూర్వజం, రఘువరం
సీతాపతిం, సుందరం
కాకుత్స్థం, కరుణాకరం, గుణనిధిం
విప్రప్రియం, ధార్మికం

* రాజేంద్రం, సత్యసంధం, దశరథతనయం,
శ్యామలం, శాంతమూర్తిం
వందే లోకాభిరామం, రఘుకులతిలకం,
రాఘవం, రామచంద్రమ్.

*తోడినాటరాగము ॥ జంపెతాళము*

జయదశరథ పుత్ర । జయ దివ్యనుతి పాత్ర ।
జయ రామ, సుచరిత్ర । జయ జగన్మిత్ర ।
జయ శుభావహగాత్ర । జయ జగత్కృతి సూత్ర ।
జయ భానుశశినేత్ర । జయ జితామిత్ర ॥
॥జయ జయ॥ జయ॥

---

1. శరయుత శరధిం

* ఈ శ్లోకములు రెండును **పూర్తిగాలేవు.**

వేణునాదవిలోల । విబుధ సన్నుతశీల ।
చాణూర మద[1]జాల । శాననాఖిల ।
బాణభంజన శీల । పావన గుణ పాల ।
వీణాముని[2]విశాల । వినయానుకూల
॥ జయ జయ ॥ జయ ॥

విమత భీకర శౌర్య । వేదాంత నుత చర్య ।
యమివినుత గుణధుర్య । యదువంశవర్య ।
కమనీయ గాంభీర్య । కాంచనాచలధైర్య ।
విమల మానసధార్య । వినుత సౌందర్య ॥
॥ జయ జయ ॥ జయ ॥

### *గౌళరాగము – త్రిపుటతాళము*

శరణు శరణు జగద్విధాయక । శరణు శ్రీహరి సాయక ।
శరణు శరణు శుభప్రదాయక । శరణు గిరిజానాయక ॥శర॥
మధుర భాషణ, మహిత తోషణ । మద విరోధి విశోషణ ।
బుధ విభూషణ, భూతపోషణ । భుజ బలాహత దూషణ ? ॥ శర ॥

నిజ పదస్తుత పూతవాసర । నిఖిల దివి జాగ్రేసర
రజనిరమణ, కళావిభాసుర । విజిత మత్త మహాసుర ॥ శర ॥
సర్వ సంభృత చరణ కింకర । గర్వితారిభయంకర ।
పార్వతీ హృదయేశ, శంకర । భవహర, క్షేమంకర ॥ శర ॥

### *గుమ్మకాంభోజి – ఆదితాళము*

మహిషాసుర మర్దని తే మంగళమ్
నిత్యం మహిత శ్రీ వర్ధని తే మంగళమ్ ।

అకలంక ఖేలనాయై । యతిలోక పాలనాయై
మకరాంక లాలనాయై ॥ మంగళమ్ ॥ మహి ॥

ప్రణత సంతోషితాయై । భవ్య సంభాషితాయై
మణిగణ భూషితాయై ॥ మంగళమ్ ॥ మహి ॥

అహివైరి సేవితాయై । హరి భావభావితాయై
మహిత సంభావితాయై ॥ మంగళమ్ ॥మహి॥

---

1. కీల 2. విలోల

శాహేంద్ర పూజితాయై । సజ్జన దీధి[1]తాయై
మహిమ[2] విరాజితాయై ॥ మంగళమ్ ॥మహి॥

శ్లో ॥ లంబోదర స్సర్వవిద్యా । లంబో దరహాసన్ముఖః ।
బంధుర స్తుత్య సుగుణో । బంధురస్తు భవన్ముదే ॥
అన్నాఁడు గనుక ॥

వ. అవురా! యీవిధంబున విఘ్నేశ్వరుని పాద పద్మములకు వందనమాచరించి యాతదనంతరంబున మరిన్నే విధానమం చేను॥

శ్లో ॥ నృత్యాకారగతైః । కరాబ్జవలనైస్థాలాయితైః, కంకణ ప్రక్వాణైః శ్రుతి తాంగతై । [3]ర్ముఖవలల్లోలంబమాలారుతైః
వీణాయామ్మృదుగీతిభిః । పరవశాన్, నారీజనాఙ్కుర్వతీ
వాగ్దేవీవదనాంబుజేనివసతు । శ్రీశాహపృథ్వీపతేః ॥
అన్నాఁడు గనుక ॥

వ. అవురా! ఈవిధంబున సరస్వతీదేవి పాదపద్మములకు వందనమాచరించి మరి న్నే విధానమం చేను ॥

శ్లో ॥ వందేతందేవదేవం । వరసురపటలీమౌళి మాణిక్యదీప
శ్రేణీనీరాజితశ్రీ । [4]సరసిజ (పదసి)ధ్యాన యోగాదిభాజాం
భక్తానామీప్సితార్థా । కలనపటుచతుర్బాహుశోభాంచిత శ్రీ
చక్రాబ్జాదిప్రభావం।శమితజగదఘం, శాశ్వతం, కృష్ణదేవమ్॥
అన్నాఁడు గనుక ॥

వ. అవురా! యీవిధంబున మహావిష్ణు పాదపద్మములకు వందనమాచరించి యాతదనంతరంబున మరిన్నే విధానమం చేను॥

శ్లో ॥ చండస్తాండవకాండ శౌండమహిమా శుండాలతుండోన్నమ।
చ్చండోద్దండప్రచండ భాండవివరత్క్వండల్యా ఖండశ్రియే ।
తండోద్దండిత చండడిండిమ ముఖోద్దండీ (శం) షండైర్వహ ।
త్కాండైర్మండితగండమండల జటాఖండోస్తు చండీపతేః ॥

అన్నాఁడు గనుక ॥

---

1. దీపితాయై 2. మహిమా
3. ముఖతల త్రోలంబమాలారుతై. 4. పదసరసిరుహం.

పరమేశ్వరుని పాదపద్మములకు వందనమాచరించి యాతదనంతరంబున మరిన్నె విధానమం జేసెను ॥

శ్లో ॥ శ్రీమానస్తు సశంకరోనిజశిరచ్చంద్రచ్యుతా జ్ఞామృతా ।
ప్లావాకార బహిస్సముద్గత కృపానిష్యందహృష్యజ్జగత్ ।
అన్యోన్యాకృతి భేదదుస్సహాగతివ్యాఖ్యాత్య దాంపత్యభా ।
గన్వర్ధాక్షరనామరూ పవిభవ స్తే భూయసే శ్రేయసే ॥

వ. అవురా ! ఈవిధంబున పరమేశ్వరుని పాదపద్మములకు
వందనమాచరించి మరినే విధానమం జేసెను ॥

శ్లో ॥ శ్రియమురుదిశతాత్తే శాహభూపాలమౌళే
కరితశుభదయాసా కృష్ణదైవస్యవీక్షా
అభినవవనమాలా మోదహృద్యాన వద్యా
నిలపరిచయలంబా నందభక్తవ్రజన్య ॥

శ్లో ॥ శాహేంద్రస్యకలానవద్య । సుకలాపాండిత్య జాగ్రద్దిశో
హోరాలంకృత దిగ్వధూకుచ । తటీకాశ్మీర దంచన్మహః
అత్రత్యాః కవయః చతుర్విధ । మహాసాహిత్యనిర్వాహకా
స్సోహంచేద్య శరూపకాభిన । యనేపారంగతోరంగతః ॥

## గద్యౌకై వారం

జయజయ శ్రాంత విశ్రాణనరాధేయ
జయజయ సర్వసజ్జనవిధేయ
జయజయ సుప్రతిజ్ఞా, జితగాధేయ
జయజయ సుప్రశస్తాభిధేయ
జయజయ లోకరక్షణ దక్షిణోపాయ
జయజయ శౌర్యతేజస్సహాయ
జయజయ శృంగారసారంగజప్రాయ
జయజయ నిర్వ్యాజసత్కృపోపాయ
జయజయ మహా ప్రతాపయశస్సమాజ
జయజయ లోకనిర్జరమహీజ
జయజయ ఏక[1]మహీతలేశ్వరతనూజ
జయజయోదార భోసలశాహరాజ

1. శాహాజీ తండ్రిపేరు ఏకోజీ

(సూ॥ వ॥ అవురా ! ఈవిధంబున అభీష్టదేవతా వందనంబు గావించి సభానాయకాదుల నభివర్ణించి, శ్రీశాహమహారాజ ప్రణీతంబైన సీతాకల్యాణంబనెడు నాటకంబు కథా క్రమంబుగా వినిపించెదము. విననవధరించరయ్యా ॥)

*కథాసంగ్రహము*

*॥ద్విపద॥*

జనక భూపాలుండు । చను దెంచి మంత్రి
కనుఁగొని సీతకుఁ । గళ్యాణమిపుడు
కావింపవలె బ్రతి । జ్ఞాపాలనముగ
వావిరిగను స్వయం । వరము చాటించు
మనుటయు భూపాలు । రరుదెంచుటయును
జనవున రామలక్ష్మణులను గూడి
వరుస గాధేయుండు । వచ్చుట, హరుని
చాపంబు దెచ్చుట । జననాథులెత్త
నోపక, సిగ్గున, । నూరకుండుటయు,
కరి యిక్షుదండంబు । ఖండించు కరణి
హరువిల్లు శ్రీరాము । డరయఁద్రుంచుటయు
దనయులు గొలువంగ । దశరథుండపుడు
ఘనతతో పెండ్లికిఁ । గదలివచ్చుటయు
బరఁగరామునికిని । భరతేశునికిని
సరసులౌ లక్ష్మణ । శత్రుఘ్నులకును
అనువొందఁగా వివా । హంబుచేయుటయు
ననియెడి కథలచే । నమరి వేడుకను
దనరుచునుండు సీ । తావివాహంబు
ఘనుఁడు, శాహేంద్రుండు । గావించె భువిని
సరస సత్కవివరుల్ । సన్నుతిసేయ
ధరణిలో నాచంద్ర । తారార్కముగను ॥

(సూ॥ వ॥ అవురా! ఈ విధంబున నీకీర్తికుదార శృంగార వేషభాషా విభూషితంబగు శ్రీశాహమహారాజ ప్రణీతంబైన సీతాకల్యాణంబనెడు నాటకంబునందు, తొలుత నిర్విఘ్న సిద్ధ్యర్థముగా విఘ్నేశ్వర ప్రార్థనసేయగా విఘ్నేశ్వరుడువచ్చే మార్గంబెవిధానమంచేను ॥)

## ద్విపద

సూ॥ పాశాంకుశంబులు । పరగహస్తముల
భాసురకనక ప్ర । భల్విలసిల్ల
బొసగలంబోదర । మున నాగవితతి
అసమాన కాంతితో । నాడు చుండంగ
వలనొప్ప మూషక । వాహనం బెక్కి
వెలయు విఘ్నేశుండు । వేడ్కతో వెడలె ॥

(సూ॥వ॥ అవురా! ఈ విధంబున తొలుత విఘ్నేశ్వర ప్రార్థనసేయగా విఘ్నేశ్వరుండు వచ్చే మార్గంబు పరాకు॥)

## దరువు—తోడిరాగము—ఆదితాళము

వందే యీశ్వరవరద!
ముదమున కుండల । ముల రుచు లమరంగ
నిదె వెడలెను వి । ఘ్నేశ్వరుడిపుడు ॥
కర్ణతాళములు । కదలంగనల్లన
స్వర్ణనిభుండే । గణపతి తగవచ్చె ॥
మూషక వాహన । మున నొప్పుచు, శుభ
వేషుడు వెడలెను । విఘ్నేశ్వరుండు
తనలంబోదర । మున ఫణులాడంగ
ఘనతను వెడలెను । గజముఖుడిపుడు ॥
మోదముతో గణ । ముఖ్యులు గొలువంగ
మోదకహస్తుడు । ముదమున వెడలె ॥

(సూ॥ వ॥ అవురా! ఈ విధంబున విఘ్నేశ్వరుండు వచ్చి సకల విఘ్నములు నివారణచేసిన యాతదనంతరంబున కథా సంవిధానంబే విధానమంచేను॥)

(వ. జనక మహారాజు కొలువునకు వచ్చునవసరంబున తొలుత ఆస్థాన సంతోషియైన కటికవాడు హెచ్చరిక చెల్లంగా వచ్చే మార్గంబున పరాకు॥)

దరువు — తోడిరాగము — ఆదితాళము

సూ॥ పట్టెనామములు పెట్టి । బాలి కోలకేలఁబట్టి ।
దట్టిపైని దుప్పటి । గట్టిగ గట్టి
జుట్టునిండపూలు చుట్టి । మిట్టపండ్లు [1]నాగబెట్టి ।
అట్టహాసముతో నిక । టాంకుఁడువచ్చె॥

(సూ॥ వ॥ అవురా ! ఈ విధంబున కటికవాఁడు వచ్చి హెచ్చరిక దెలిపిన తదనంతరంబున జనకమహారాజు కొలువునకు వచ్చేమార్గంబె విధానంబంచేను॥ )

చ. కనక కిరీట మెంతయు వికాసముతో శిరమందు మీరఁగా
మునుకొని సద్భటుల్ మిగుల మోదముతోడుతఁగొల్చుచుండఁగా
దినకర తేజుఁడై స[2]కల దిక్కులయందు ప్రభల్ చెలంగఁగా
జనకుఁడు వచ్చె కొల్వునకు చంద్రునికైవడి వింత వైఖరిన్ ॥

(సూ॥ వ॥ అవురా ! ఈ విధంబున జనకమహారాజువచ్చే మార్గంబు పరాకు.)

దరువు — తోడిరాగము — ఆదితాళము

సూ॥ కనకరత్నమయ భూషణములు దనరఁగ
జనకుఁడు వెడలెను తనదు కొల్వునకును
జనులు చూడఁగా బంధు జనములు కొనియాడ
ఘనుఁడు ని[3]త్య కొల్వుకు గరిమ వెడలె.

(సూ॥ వ॥ అవురా ! ఈ విధంబున జనకమహారాజు కొల్వుకు వచ్చిన యాతదనంతరంబుననాయన కొల్వుకు మంత్రి వచ్చే మార్గంబు పరాకు॥)

దరువు — కేదార గౌళరాగము — ఏకతాళము

సూ॥ సతత నీతిపరుండు । సకల జనహితుండు
చతురుపాయములందు । చతురుఁడైన మంత్రి వెడలె

(సూ॥ వ॥ అవురా ! ఈ విధంబున మంత్రి వచ్చిన యాతదనంతరంబున జనకమహారాజు వామదేవుని పిలువు మనగా—
పురోహితుండు వామదేవుండు వచ్చే మార్గంబెవిధాన మంచేను॥)

---

1. యాగఁబెట్టి 2. వెలయు 3. తనదు

సూ॥ క. సారెకు శిష్య గణంబులు
చేరువ నుండు భక్తిమీరి సేవలు చేయన్
సారసనేత్రుని దలచుచు
ధీరుండైనట్టి వామదేవుడు వెడలెన్ ॥

(సూ॥ వ॥ అవురా! ఈ విధంబున జనక వచన ప్రకారంబుగా
వామదేవుండు వచ్చేమార్గంబు పరాకు ॥)

దరువు — కేదార గౌళరాగము — ఏకతాళము

సూ॥ వేద శాస్త్ర పురాణ విదుండు వామ దేవుండు
సాదరమున వెడలె జనకు కొల్వునకును॥

(సూ॥ వ॥ అవురా ! ఈ విధంబున వామదేవుండు వచ్చిన
యాతదనంతరంబున వామదేవుని జూచి జనకమహారాజు పలికే
మార్గంబు పరాకు ॥)

ద్విపద

జన॥ విను వామ దేవ । యీ[1] వేళ నామాట
వనజాక్షి సీత జ । వ్వని యాయె, పెండ్లి
గావింపవలె ప్రతి । జ్ఞయుండెల్ల వలయు
నీ వేళను ఉపాయ । మిది యని తెల్పు॥

(సూ॥ వ॥ అవురా ! ఈ విధంబున జనకమహారాజు వాక్యంబులు
విని వామదేవుండు ప్రత్యుత్తరంబుగా పలికే మార్గంబు పరాకు ॥)

ద్విపద

వామ॥ తిరమొప్ప నీ రెండు । తెఱంగుల కిపుడు
వెరపుతోఁ చదుమాకు । వేగంబె నీవు
ఇది యుపాయంబని । యెఱింగింపు నాదు
మది చెలంగంగను । మహిపాల చంద్ర ॥

(సూ॥ వ॥ అవురా! ఈ విధంబున వామదేవుని వాక్యంబులు విని
జనకమహారాజు ప్రత్యుత్తరంబుగా పలికే మార్గంబు పరాకు॥)

---

1. కేవల స్వరయతియాం ?

## ద్విపద

జన॥ వలనొప్పగా స్వయం । వరము చాటింప
వలయు మహీపాల । వరులను వేగ
పిలిపింపుఁడెవఁడైన । పేర్మితో హరుని
[1]విలునెక్కుపెట్టినఁ జెలువ నిచ్చెదను ॥

(సూ॥ వ॥ అవురా ! ఈ విధంబున జనకమహారాజు వాక్యంబులు విని వామదేవుండును మంత్రియును వార్తలాడు కొన్నవారలై పట్టణంబు శృంగారించ నుద్యుక్తులై తలవరుల పిలువుమనఁగా తలవరులు వచ్చే మార్గంబు పరాకు ॥ )

## దరువు - బేగడ రాగం — త్రిశ్రఏకతాళము

సూ॥ అరిగెలు, కత్తులును, పిండ్లును
మెఱయు తుపాకులు తుడుములును
కరములఁబూనుకొని తలవరు
లరు దెంచిరి కడు వింతగను॥

(సూ॥ వ॥ అవురా! ఈ విధంబున వచ్చిన తలవరులు జనక వచన ప్రకారంగా పట్నంబు శృంగారించే మార్గంబు పరాకు॥)

## దరువు-బేగడరాగము—ఏకతాళము

సూ॥ ముత్యాల హారతులు దేరె । ముత్తైదులార ।
నిత్యతోరణాలెత్తరోయి । నీటుగ మానవులార ।
కదళి కంబములు నిలుపరమ్మ । కనకాంగులార ।
ముదమున పన్నీరు జల్లరె । మోహనాంగులార మీరు ।
అంగళ్లు శృంగారించరోయి । అ[2]తివర్తకులార ।
సంగీత మేళముతో రారె ।
రంగుగా ఓ వేశ్యలార ।

(సూ॥ వ॥ అవురా ! ఈ విధంబున తలవరులు వచ్చి పట్నంబు శృంగారించి ఛప్పన్న దేశాలకు స్వయంవరము చాటంపఁగా, స్వయంవర వార్తను విని సకలదేశాధీశ్వరులు వచ్చునవసరంబున వారలకు విడుదులు నులుపాలు అమర్చవలసి కరణీకుని పిలువుమనఁగా కరణీకుఁడు వచ్చే మార్గంబున పరాకు॥)

---

1. విలునెక్కుపెట్టిన వెలయు నాతనికి[1]జిలుకల కొలికైన సీతనిచ్చెదను. (పా)
2. అనఘు

దరువు—శంకరాభరణము—జంపెతాళము

సూ॥ పండ్లు తెఱచుక । పకపక నగుచు, పుసులు
కండ్ల కారుచుండ కుంటి కరణమువాడు వచ్చెను ॥

(సూ ॥ వ ॥ అవురా ! ఈ విధంబున కరణీకుడు వచ్చిన యాతద నంతరంబున స్వయంవర వార్తను విని సకలదేశాధీశులు వచ్చు నవసరంబున తొలుత మగధాధీశ్వరుఁడు వచ్చే మార్గంబు పరాకు ॥)

దరువు—సౌరాష్ట్రరాగము—రూపకతాళము

సూ॥ సొగసైన కిరీటము నిగనిగ నీటు దేర
మగధేశుండు వెడలె । మదగజముపై నెక్కి ॥

(సూ ॥ వ ॥ అవురా ! ఈ విధంబున తొలుత మగధాధీశ్వరుండు వచ్చిన యాతదనంతరంబున మాళవేంద్రుఁడు వచ్చే మార్గంబు పరాకు ॥ )

దరువు—సౌరాష్ట్రరాగము—రూపకతాళము

సూ॥ చాల భటులు గొలువ । వాలు కేలను బూని
మాళవేంద్రుఁడు వెడలె । మేలైన రథమునెక్కి

(సూ ॥ వ ॥ అవురా ! ఈ విధంబున మాళవేంద్రుఁడు వచ్చిన యా తదనంతరంబున సింధుదేశాధీశ్వరుండు వచ్చే మార్గంబు పరాకు ॥ )

దరువు—ధన్యాసి, గౌళిపంతు—చతురశ్రఏకతాళము

సూ॥ తేజము మీర రాజిల్లు నేజము చేతఁబూని
తేజినెక్కి యాసింధు దేశాధీశుండు వెడలె ॥

(సూ ॥ వ ॥ అవురా ! ఈ విధంబున సింధుదేశాధీశ్వరుండు వచ్చిన యాతదనంతరంబున లాటదేశాధీశ్వరుండు వచ్చే మార్గంబు పరాకు ॥)

దరువు—ధన్యాసిరాగము—చతురశ్రఏకతాళము

సూ॥ మేటివిల్లు చేఁబూని । నీటుగా సేనలు గొల్వ
లాటాధీశుండు వెడలె । సాటి లేక యీ వేళ ॥

(సూ॥ వ॥ అవురా ! ఈ విధంబున సకల దేశాధీశ్వరులు వచ్చిన యాతదనంతరంబున జనక మహారాజు కొల్వునకు నాటకశాలస్త్రీలు వచ్చే మార్గంబు ఏ విధాన మంటేను ॥ )

సూ॥ సీ॥ కురులపై నెత్తావి । పసలు పిసాళింప
కలికి చూపుల నీటు । లొలుకు చుండ
మెఱుగు గుబ్బలపైట । చెరగు దువాలింప
హారువు ముత్యపు సరుల్ । మురువు లీన
జాళువాయందెలు । లీల ఘల్లున మ్రోయ
గిలుకు మెట్టెల సద్దు । గులకరింప
బంగారు రవికెడాల్ । సింగార మలరంగ
పలుకుల తేనియ । లొలుకుచుండ
తే॥ గీ॥ చిత్తరువు బొమ్మ చందంబు । చెనువు మీరి
చిత్తజుని మాయ వైఖరి । శ్రీ చెలంగ
కొలువు భోగంపు చానలై । యలరజనకు
కొలువుచేయంగ వచ్చిరి । చెలువెసంగ ॥

వ॥ అన్నాడు గనుక ॥

(సూ॥వ॥ అవురా ! ఈవిధంబున నాటకశాల భామామణులు వచ్చేమార్గంబు పరాకు ॥)

*దరువు—కాపీరాగము—మిశ్రచాపుతాళము*

సూ॥ నాటకశాలా భామలు । మేటిగ వెడలిరి
ముద్దు పాటలాటల । సరిసాటిలేరన
కులుకు గుబ్బల పయ్యెద । కొంగులొక్కింత జాఱంగ
వలరాజు శరములన । వచ్చిరిపుడు
అందమైన చనుకట్టు । కందు ముత్యాల సరులు
పొందుగ చెలంగవచ్చిరి । పువ్వు బోణులు ॥

(సూ॥ వ॥ అవురా ! ఈ విధంబున నాటకశాల భామామణులు వచ్చిన యాతదనంతరంబున స్వయంవర వార్తవిని విశ్వామిత్రుడు రామలక్ష్మణులతోడ్కొని మిథిలాపురీ పట్టణంబునకువచ్చేమార్గంబు పరాకు॥)

### దరువు—మధ్యమావతిరాగము—చతురశ్రఏకతాళము

సూ॥ నిడుద జడలముడి । నీటుగా సవరంగ
ఒడలను భూతియు । రోజవున మెఱయ
పొడమిన వేడుక । పులితోలు ధరించి
వెడలెను వింతగ । విశ్వామిత్రుండు ॥
గుఱుతుగాను చిప్ప । కూకటులుదనర
కరముల ధనువులు । గరిమనుబూని
సరసులు రాముల । క్ష్మణులు వెంబడి రాఁగ
మెరవడిగా విశ్వా । మిత్రుండు వెడలె ॥

(సూ॥ వ॥ అవురా ! ఈవిధంబున స్వయంవర మంటపానికి విశ్వామిత్రుడు వచ్చిన యాతదనంతరంబున జనకమహారాజు సీతాదేవిని పిలువుమనఁగా సీతాదేవి వచ్చే మార్గంబెవిధానమనఁగా ॥)

### ద్విపద

సూ॥ చిత్తజుమదదంతి । చెలులమేల్బంతి
పుత్తడి బొమ్మ సొం । పొనరుపూరెమ్మ
కలహంసయాన స । త్కళలందు జాణ
అలినీలవేణి మే । లైన పూబోణి
జనక తనూజాత । జగదేక మాత
కనకాంగి సీత శ్రీ । కరగుణవ్రాత
మొలకనవ్వులు ముద్దుమోమునఁదనర
చెలియలు గొలువంగ । చెలువొంద వెడలె ॥

సూ॥ వ॥ అవురా ! ఈవిధంబున సీతాదేవి వచ్చేమార్గంబు పరాకు ॥)

### దరువు—మధ్యమావతిరాగము—చతురశ్రఏకతాళము

సూ॥ కనక భూషణములలర
జనకజ కులుకునడల
వెడలె నీవేళ ॥
మనసిజుశరమొయని
జనములు కొనియాడ
గరిమ మీరఁగవెడలెను ॥
సీతాకన్యక

గరిమను వెడలెను । మరుశరమనఁగను
కలికు జడనువిరి । సరములు మెఱయ
అందెలు ఘల్లు ఘల్లని మ్రోయ పాదములందు
అందముగ జను । లందరు చూడఁగ
ఇందువదన చెలు । వొందెడినడల ॥

(సూ॥ వ॥ అవురా! ఈవిధంబున సీతాదేవి వచ్చిన యాతదనంతరం బున జనకమహారాజు అర్థవై వేల కింకరులచేత హరుని చాప మెత్తుక రమ్మనఁగా హరుని చాపంబు దెచ్చే మార్గంబు పరాకు ॥)

*దరువు — మాళవగౌళరాగము — చతురశ్రఏకతాళము*

సూ॥ కింకరులెల్ల గుంపుగూడి
శంకరు ధనువు నెత్తుక మెల్లన
పొంకముగ జనకు సభకుదెచ్చిరి
కొంకక "యెలెలో, యెలెలో" యనుచు ॥

(సూ॥ వ॥ అవురా! ఈవిధంబున నాకింకరులు హరుని చాపంబు దెచ్చిన యాతదనంతరంబున జనకమహారాజు అభిమతం బెఱిగి సకల దేశాధీశ్వరులను జూచి వామదేవుండు పలికే మార్గంబు పరాకు ॥)

*ద్విపద*

వామ॥ తెలిపెద వినరయ్య । ధీమంతులార ।
బలశాలులార భూ । పాలకులార ।
చెలఁగి సంతోషంబు । చెందుచు బలము
వెలయంగ నెవఁడైన । వెఱవక లేచి
చక్కగా శంకరు । చాపమొక్కింత
ఎక్కు వెట్టిన వాని । కేనిత్తు సీత
నని జనకుండు మ । హా ప్రతిజ్ఞయును
ఒనరంగ దాఁజేసి । యున్నాఁడు గాన
గట్టిగా నీశుని । కార్ముకం బెక్కు
పెట్టి యీ సీతను । పెండ్లాడవలయు ॥

(సూ॥ వ॥ అవురా! ఈవిధంబున పలికిన వామదేవుని వాక్యంబులు విని యానృపతులు హరునిచాపం బెక్కుపెట్టి వచ్చేమార్గంబుపరాకు॥

(సూ॥ వ॥ అవురా! ఈవిధంబున పలికిన నృపతుల వాక్యంబులు
విని, జనకమహారాజు చింతాక్రాంతుండై పలికే మార్గంబు పరాకు॥)

*దరువు—అసావేరిరాగము—త్రిపుటతాళము*

జన॥ ఎందుకీ ప్రతిజ్ఞచేసితి । మందుడైతి మునివర! ॥
ముందుగా నింతైన తెలియక । మోసపోతి ॥ ఎం ॥
తిన్నగా విల్లెక్కుపెట్టే । మన్నవారునిపుడు
చిన్నవోయియున్నారు । [1]సిగ్గులజెందివీరు ॥ ఎం ॥
ఎన్నటికి నీ కన్యకకు పెండ్లెనుసేతు మునివర ।
యెన్నరాని విచారమాయెను । ఏమిసేతు ॥ ఎం ॥

(సూ॥ వ॥ అవురా! ఈవిధంబున చింతాక్రాంతుడై పలుకుచున్న
జనకమహారాజును జూచి విశ్వామిత్రుడు పలికేమార్గంబుపరాకు ॥)

*ద్విపద*

విశ్వా॥ వినవోయి జనక భూ । విభు చంద్ర నేఁడు ।
ఘనులు నీ రాజులు । కార్ముకంబెత్త
నోపక యూరకె । యున్నారు వీరు
బాపురె! యని మెచ్చ । బాలుని చేత
గ్రక్కున చంద్ర శే । ఖరుని చాపమ్ము
నెక్కిడఁజేసెద । నీ క్షణంబునను
ఘనత తోడుత ప్రతి । జ్ఞా ప్రకారముగ
తనయనిచ్చెదవె యీ । తనికి వేడుకను ॥

(సూ॥ వ॥ అవురా! ఈవిధంబున విశ్వామిత్రుని వాక్యంబులు విని
జనకమహారాజు ప్రత్యుత్తరంబుగా పలికే మార్గంబు పరాకు ॥ )

*దరువు—పంతువరాళిరాగము—త్రిపుటతాళము*

జన॥ బాలనిచ్చెద నేని । మేలు నా
పద్దు చెల్లితే పదివేలు
ఏలాగైనను ఈవిల్లు బాలుం
డెక్కుపెట్టిన చాలు ॥

---

1. సిగ్గులనందివీరు; సిగ్గును బొందివీరు

దరువు — మోహనరాగము — త్రిపుటతాళము

రామ ॥ వింతగానిది యిందుశేఖరుని । విల్లటంచు మునివర ।
ఎంతగాకొని యాడుచుండిరి । ఈ నృపతులు,
చులకనైనది, నాదుఘనభుజ । [1]బలమున కిపుడు
చాలదు వెలయ నీవిల్లు వంచినప్పుడు విఱుగునేమో ॥

దరువు — మోహనరాగము — త్రిపుటతాళము

విశ్వా :- విఱిగితేనేమాయె శ్రీ రఘువర । విచారమేలను ?
సరసుండ విల్లెక్కు వెట్టు నామది । సంతసిల్ల ॥
మండలేంద్రులు కలఁగి చూడ కో । దండమపుడు రాముఁడు
మెండుగా ఖండించె విబుధులు । మేలనంగా ॥

(సూ॥ వ॥ అవురా ! ఈ విధంబున రామభద్రస్వామి ధనుర్భంగము చేసెగనుక విశ్వామిత్రుడు గ్రుచ్చికవుగిటచేర్చి శిరస్సాఘ్రాణించి జనకమహారాజును జూచి పలికే మార్గంబు పరాకు ॥)

విశ్వా:-వ॥ వినవోయి జనకమహారాజా ! మా ప్రతిజ్ఞ మేము చెల్లిస్తిమి. మీ ప్రతిజ్ఞాప్రకారముగ సీత నియ్యవోయి ॥

(సూ॥ వ॥ అవురా ! ఈ విధంబున విశ్వామిత్రుని వాక్యంబులు విని జనకమహారాజు చింతాక్రాంతుడై పలికే మార్గంబు పరాకు ॥)

దరువు — ఆనందభైరవి రాగము — త్రిపుటతాళము

జన॥ ఇతండు మహాబాలుం । డితండు ముని శిష్యుండు
ఇతనికి నీ సీతను । ఇచ్చే నెటువలె వామదేవ ॥
శృంగారవతియైన । సీత నియ్యకపోతే
రంగైన నాప్రతిజ్ఞా భంగమవుచున్నది

(సూ॥ వ॥ అవురా! ఈ విధంబున చింతాక్రాంతుడై పలికిన జనక మహారాజును జూచి, వామదేవుండు పలికే మార్గము పరాకు ॥)

వామ ॥ వ॥ వినవయ్యా ! జనకమహారాజా । వీరలను చూస్తే ఋషి కుమారులుగా కనపడరు. మాయింట్లో ఋషికుమాళ్లు నూఱుమంది ఉన్నారు. వారలచేత నిటువంటి కార్యము

---

1. బలిమి.

కానేరదు. విశ్వామిత్రునిచేత వృత్తాంతంబు సవిస్తారము తెలియఁబడుగవయ్యా ॥

(సూ॥ వ॥ అవురా! ఈ విధంబున రామదేవుని వాక్యంబులు విని విశ్వామిత్రుడు రామస్వామి వృత్తాంతంబు సవిస్తారముగా తెలిపె మార్గంబు పరాకు ॥)

ద్విపద

విశ్వా ॥ వినవోయి। జనకేశ!। వీరలు మౌని
తనయులటంచు చి। త్తమున నెంచకుము
వినద భానుకులుండు। విక్రమోన్నతుఁడు
దశరథ రాజ సు। త్రాముండు ఘనుఁడు
అఱువది వేలేఁడు। లవని పాలించి
తఱిదప్పిముదిసి సం। తానంబు లేక
చింత చెందుచు ఋశ్య। శృంగుననుమతి
నెంతయు భక్తితో। నేపు దీపింప
పుత్ర కామేష్టిన। ద్భుతముగాఁజేయ
చిత్రంబు మీరఁగ। శ్రీశునంశమున
నలువొందఁగలిగిరి। నలుగురు సుతులు
సుతులలోపల నగ్ర। జుండు రాముండు
ఆతనికి తమ్ముండు। ఈ లక్ష్మణుండు
వేడ్కతో దశరథు। వేడి వీరలను
తోడ్కొని నే రాఁగ। త్రోవను దుష్ట
తాటకను వధించి। తనర నా యజ్ఞ
వాటిని దానవ। వరులను గూల్చి
యాగంబు గాచి య। హల్యశాపంబు
వేగంబెతూలించి। వింతవైఖరిని
వరుసతోడుత స్వయం। వరము చూడఁగను
అరుదెంచి హరుచాప। మవలీలఁద్రుంచి
యెల్ల రాజులనుతి। నీరాముఁడల్లు
డాయెను, ధన్యుఁడ। వైతి వీవేళ ॥

(సూ॥ వ॥ అవురా ! ఈ విధంబున పలికిన విశ్వామిత్రుని వాక్యంబులు విని జనకమహారాజు సంతోష భరితాంతరంగుండై పలికే మార్గంబు పరాకు ॥)

*దరువు ॥ ఆనందభైరవి రాగము — త్రిపుట తాళము*

జన ॥ ముని చంద్ర ధన్యుండైతి నేను
ధరణిజనువేగ శ్రీరామచంద్రునకిచ్చెదను ॥ ము॥
ఘనులైన నృపులు చూడఁగను పెండ్లి
దశరథ సేవనిపుడు దయమీరఁగాను ॥ ము॥

(సూ॥ వ॥ అవురా ! ఈ విధంబున సంతోష భరితాంతరంగుడై పలికిన జనకమహారాజును జూచి విశ్వామిత్రుఁడు పలికే మార్గము పరాకు ॥ )

## ద్విపద

విశ్వా॥ రాజ దేవేంద్ర ! శ్రీరాము పెండ్లికిని
రాజిల్లు నా దశ । రథరాజు నిపుడు
ఎలమి బాంధవ పురో । హితులతో కూడ
పిలిపింపవలయు పెం । పెసఁగ వేడుకను ॥

(సూ॥ వ॥ అవురా ! ఈ విధంబున విశ్వామిత్రుని వాక్యములు విని జనకమహారాజు మంత్రిని అయోధ్యాపురికి పంపవలసిన వేగుల వారిని పిలువుమనఁగా వేగులవారు వచ్చే మార్గంబు పరాకు ॥ )

*దరువు—సావేరిరాగము—ఏకతాళము*

సూ॥ గుదియలు చేబూనిచద్ది । కూటిమూటలు వ్రేలాడ
ముదమున వేగుల వారు । మ్రొక్కుచు వచ్చిరిపుడు॥

(సూ॥ వ॥ అవురా ! ఈ విధంబున మంత్రి అయోధ్యాపురికి వచ్చు నవసరంబున ఆవలి కథా సంవిధానంబేమంటేను దశరథ మహారాజు కొలువునకు వచ్చే మార్గంబు పరాకు ॥ )

*దరువు—సావేరిరాగము—ఏకతాళము*

సూ॥ అంగవంగ కళింగావనీశులు కొలువఁగ
రంగు మీర దశరథరాజు తావెడలె ॥

(సూ॥ వ॥ అప్పురా! ఈ విధంబున దశరథ మహారాజు కొలువునకు వచ్చిన యాతదనంతరంబున నతని కులగురుండైన వసిష్ఠ మహాముని వచ్చే మార్గంబు పరాకు ॥ )

దరువు—కళ్యాణిరాగము—చతురశ్రఏకతాళము

సూ॥ కరమున దండము మెఱయఁగ రుద్రాక్షు
సరములు మిక్కిలి సరసతతోఁ దనర
గరిమను తన శిష్య గణములతో కూడ
అరుదెంచె వసిష్ఠవరముని యిప్పుడు ॥

(సూ॥ వ॥ అప్పురా! ఈ విధంబున వశిష్ఠ మహాముని వచ్చిన యాతదనంతరంబున దశరథమహారాజు రామలక్ష్మణులు రాక తామసించినారని చింతాక్రాంతుండై పలికే మార్గంబు పరాకు ॥)

దరువు—ధన్యాసిరాగము—త్రిపుటతాళము

వశి॥ ఏమి సేయుదు నెవ్వారి నంపుదు ఏమో
తామసించె నామౌని
రామలక్ష్మణుల సేమ మింతైన
వేమారు నొకరిచే వింటినైతిఁగా
చిన్నారి శిశువుల చెక్కిలి నేనొక్కి
కన్నుల పండుగ గా వారిని
ఎన్నఁడు కౌగిట ఎలమిగ జేర్తును
ఎన్నో దినము లాయె నెడఁబాసి

దరువు—మధ్యమావతి—ఏకతాళము

కటి॥ స్వామీ! మిథిలాపురినుండి మంత్రి వచ్చియున్నాఁడు.
దశ॥ ఈవేళ ఎక్కడి మంత్రి పొమ్మనరా.
వశి॥ పిలిపించవయ్యా.

మంత్రి॥ ఇదిగోనయ్యా! జనకమహారాజు కమ్మ ఇమ్మన్నాఁడు
దశ॥ ఎవరురా! మన వ్రాయసకాండ్రు
కమ్మ చదువుమనరా।

( కమ్మ : )

ద్విపద

ప్రాయ॥ ॥శ్రీమంతునకు కుల । సింధు సోమునకు
ధీమంతునకు భూమి । దేవేంద్రునకును
లలితుఁడౌ దశరథ । రాజుకు చంద్ర
కులజుండు సకల స । ద్గుణసమన్వితుఁడు
పలుమార్లు జనక భూ । పాలుండు మొక్కి
వెలయ చేయంగల। విన్నపంబెపుడు
వెలయరాముఁడు హరి । విల్లు మోపెట్టి
చెలువొందఁద్రుంచెను । సీతనిచ్చెదను
వన్నెమీరిన యట్టి [1]వైశాఖ నెలను
పున్నమ నాడున । పొలుపొంద నాలు
గడియల యందు ల । గ్నంబు గావునను
తడయక బాంధవ । తతులఁగూర్చుకొని
హితసుతవరపురో । హితులతోఁగూడి
అతివేగరండి మీర । తిశయంబునను ॥

(సూ॥ వ॥ అవురా ! ఈ విధంబున మంత్రి తెచ్చిన కమ్మ చదువు కొన్నవాడై సకల సన్నాహముతో కూడగట్టుకొని దశరథ మహారాజు మిథిలాపురికి సాగి వచ్చే మార్గంబు పరాకు ॥ )

*దరువు — బిలహరిరాగము — జంపెతాళము*

సూ॥ మగధ మాళవ మత్స్య । మండలేంద్రులు గొలువ
మిగుల భటులు కొనియాడ
వగగ తనయులును వసిష్ఠముని రాఁగను
తగిన బాంధవులతో । దశరథుండు వెడలె॥

( సూ॥ వ॥ అవురా ! ఈవిధంబునదశరథ మహారాజునెదుర్కొని జనక మహారాజు పలికేమార్గంబు పరాకు ॥ )

ద్విపద

జన॥ రాజేంద్ర ! దశరథ ! రాజ ! నీ సుతుఁడు
రాజశేఖరు విల్లు । రయమునఁద్రుంచి
భూమిజగైకొనె । భుజబలంబునను

1. వైశాఖమాస పూర్ణిమా దినమున

తామసించకను నా । తనయలై పుట్టి
మాళవి ఊర్మిళ । మఱి శ్రుతకీర్తి
మేలైన భరత సౌ । మిత్రి శత్రుఘ్ను
లకు నొసంగెదను ఈ । లగ్నంబునందె
సకల బాంధవులును । సన్నుతిచేయ॥

( సూ॥ వ॥ అవురా! ఈ విధంబున పలికిన జనకమహారాజు వాక్యంబులు విని దశరథ మహారాజు పలికే మార్గంబు పరాకు॥ )

దరువు — కాంభోజిరాగము — త్రిపుటతాళము

దశ॥ జనక మహీపాల । వినుము నీవు
చంద్రవంశ రాజేంద్రుఁడవు
జనులు మెచ్చఁగ నీతో సంబంధ
మొనరింప ఘనుఁడనైతి నే నీవేళ ॥

జన॥ భూవలయమున నీవు దశరథ !
పూజ్యుండవు రవి వంశజుఁడవు
వేవేగ నీతో వియ్యమందఁగలిగె
పావనుండనైతి నేను ॥

(సూ॥ వ॥ అవురా! ఈ విధంబున నీరీతి పలికిన వాఁడై జనక మహారాజు తన కన్యకామణుల పిలువుమనఁగా కన్యలు వచ్చే మార్గంబు పరాకు ॥)

దరువు — కాపీరాగము — త్రిపుటతాళము

సూ॥ ఒయ్యారముగ వెడలిరి । తియ్యవిల్తు శరములన
తొయ్యలు లందఱుకొలువ । నెయ్యమున కన్యకలు
సన్నని పయ్యెదలో । చిన్ని పన్నులు చెలంగ
పున్నమ చందురు సరి । పోలు మోవము వెలుగఁగ
రాజిల్లు రూపున వల । రాజు మోహమ్ము చెందఁగ
రాజహంస నడలను । రాజ బింబవదనలు ॥

( సూ॥ వ॥ అవురా! ఈ విధంబున కన్యలు వచ్చిన యాతదనంతరంబున దశరథమహారాజు జ్యేష్ఠపుత్రుండైన రామస్వామికి సీతాదేవిని, మాళవి భరతేశునికిని, ఊర్మిళ లక్ష్మణునికిని, శ్రుతకీర్తి

శత్రుఘ్నునికిని ఈ రీతిసంకల్ప పూర్వకంబుగా ధారవోయు నవసరంబున నారదకిన్నర కింపురుషులు మంగళంబులు పాడే మార్గంబు పరాకు॥)

మంగళం—మధ్యమావతిరాగము—జంపెతాళము

బృందం॥ మారామ భద్రునికి మంగళం
నిత్యం మాసీతదేవికి మంగళం ॥ మం ॥
వనజాతనేత్రునికి । వరకీరవాణికి
మనసిజ రూపునికి మంగళం॥ మం ॥
భానుకులేశునికి పరమ కల్యాణికి
మానవేంద్రునికి మంగళం ॥ మం ॥
విహగ వాహనునికి విరిబోణికి
శ్రీ శాహమహీపాల దేవునికి మంగళం ॥ మం ॥

సంపూర్ణము